



శ్రీమహాగణాధిపతయే నమః

శ్రీరస్తు　　శుభమస్తు　　అవిఘ్నమస్తు

శ్రీ మహాత్రిపుర సుందరీ సమేత శ్రీమేధా దక్షిణామూర్తి దేవతాభ్యో నమః

# మధుర వారి

# శ్రీ హేమలంబ నామ సంవత్సర పంచాంగము

జ్యోతిష విజ్ఞాన కేంద్రము, విశ్వవిజ్ఞాన ప్రతిష్ఠానం వ్యవస్థాపకులు, వాచస్పతి, జ్యోతిషవిజ్ఞానభాస్కర, వాస్తుకళానిధి,
రాష్ట్రపతి అవార్డు గ్రహీత, మహామహోపాధ్యాయ అయిన

**29-3-2017** కీ.శే. శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారి ఆశీస్సులతో..... **18-3-2018**
















పంచాంగ కర్త :

## 'దైవజ్ఞ' మధుర పాలశంకరమూర్తిశర్మ
## (యం.పి. శర్మ)

బి.కామ్., బి.ఎల్., యం.పి., (జ్యోతిషం)

visit us @
www.jvkastrology.com













అడ్రసు: 17-14-6/1 కృష్ణనగర్, సీతంపేట రాజమహేంద్రవరం - 533 104.

వెల : 50-00

## విషయసూచిక



## జ్యోతిష విజ్ఞాన కేంద్రము వారి విన్నపము

జ్యోతిష విజ్ఞాన పత్రిక సాధారణ మరియు శాశ్వత సభ్యులకు మనవి :

అయ్యా

ఈ సంస్థ వ్యవస్థాపకులు ది. 6-4-2016 "స్వర్గస్థులైన" విషయం అందరకు విదితమే.

ఆ తరువాత జూలై 2016 సంచిక నాన్నగారి స్మారక సంచికగా విడుదలచేసి సభ్యులందరకూ ఆ పత్రిక పంపడమైనది. జ్యోతిష విజ్ఞానపత్రికను తాత్కాలికముగా నిలుపుట జరిగినది.

మా నుండి ప్రతీ సంవత్సరము జనవరి పత్రికతో కలిపి వచ్చే శ్రీ నాన్నగారి గణితరీత్యా వెలువడే శాస్త్రీయ దృక్సిద్ధాంత పంచాంగం సభ్యులకు అసౌకర్యము కలుగ కుండా పంపుటకు నావంతు కృషిని మీ హార్దిక, ఆర్థిక ఆదరాభిమాన ములతో, నాన్నగారి ఆశీర్వచనములతో కొనసాగి స్తానని మనవి చేస్తున్నాను.

ఇట్లు

**యం.పి. శర్మ**

సంపాదకులు

## శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారిచే వ్రాయబడి విడుదలకు సిద్ధముగా నున్న పుస్తకములు

1. గోలాధ్యాయం
2. అయనాంశ చర్చ - 2
3. శ్రీ మధుర కృష్ణమూర్తిశాస్త్రిగారి జ్యోతిష విజ్ఞాన పత్రికలలోని వ్యాసాల సంపుటి - 1
4. ముండేన్ అస్ట్రాలజీ మరియు
5. శ్రీ శాస్త్రిగారి ఛాయార్క (సాయన) - సంస్కృత కరణార్క (నిరయన)నీతములైన గణిత రీత్యా (మధుర వారి) 12(పుష్కర)సం॥ములపంచాంగ ముల సంపుటి, (2018 ఉగాది నుండి 2029 ఉగాదితో కూడినవి) మొదలగు పుస్తకములు మీ ముందుకు రాబోతున్నవి. పై గ్రంథములు కావలసిన వారు ముందుగా మీ చిరునామా, ఫోన్ నెం. పంపి మీ కాపీని, రిజర్వు చేసుకొనవలసినదిగా మనవి.


మా చిరునామా :

**జ్యోతిష విజ్ఞానకేంద్రము**

**17-14-6/1, కృష్ణనగర్, సీతంపేట,**

**రాజమండ్రి - 533104. ఫోన్ (0883-2426436)**

e-mail : sarma.astro@gmai.com

jvkpandits@gmail.com



శ్రీపాద వెంకటరమణ దైవజ్ఞ శర్మగారు
జననం 3-10-1884
మరణం 20-11-1968

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మహాత్రిపుర సుందరీ సమేత శ్రీ మేధా దక్షిణామూర్తి దేవతాభ్యో నమః

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# శ్రీ హేమలంబ నామ సంవత్సర పంచాంగము

( శాస్త్రీయ దృగ్గణిత పంచాంగము-సౌరాది సర్వ సిద్ధాంత సమ్మతములైన ఛాయార్క-సంస్కృత కరణార్కానీతములైన అయనాంశములు 29-3-2017 (ఉగాది)కి భా॥ 21°-06'-10" సె॥లు



శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి గారు
జననం 28-02-1928
మరణం 06-04-2016

## దైవ ప్రార్థన

శ్లో॥ విఘ్నేశవిధి మార్తాండ చంద్రేంద్రోపేంద్రవందిత॥ నమోగణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే అచింత్యావ్యక్త రూపాయ నిర్గుణాయ గుణాత్మనే॥ సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణే నమః॥ లంబోదర పదాంభోజ ముఖచంద్ర కరోత్కరః॥ ప్రత్యూహ తిమిరాపూరం దూరీ కరోతునః॥ శారదేందు సమదీప్తి సుందరీం సుదరీం సలిలం జన్మ జన్మనః॥ భక్తపాలనసకలా విశారదాం శారదాం సతతమాశ్రయా మహే॥

గురుస్తుతిః:- శ్రీమచ్ఛ్రీపాద వంశాంబుధి హిమకిరణంధీ విశేషాత్త కీర్తిం శ్రౌతస్మార్తాది విద్యాచణ మలఘు గుణం సాహితీ సత్రపూర్ణం॥ సిద్ధాంతార్యాద్యనేకాగమ గణితలసద్గోళ తత్వార్థ విజ్ఞం శిష్యైర్మైరర్చి తాంఘ్రిం శచీదేవీ వేంకటరమణ గురుంభావ యామ్యం తరంగే॥ శిష్యోహం కృష్ణశాస్త్రీతి విఖ్యాతో మధురాన్వయః॥ శచీదేవీ వేంకయార్య సుత శ్శాస్త్రజ్ఞ పూజితః॥ సౌరాది సర్వసిద్ధాంత సంమతం సుస్ఫుటం హియత్॥ పండితై ర్బహుభిర్మాన్యం శ్రౌతస్మార్త క్రియార్హకం॥గురుమార్గానుసారేణశాస్త్రీయస్ఫుటకర్మణా ।గణితేన తనోమ్యేతత్పం చాంగం సౌరమార్గతః॥

**మా గురుపరంపరలో మొదటివారు శ్రీశ్రీశ్రీ బాపూదేవశాస్త్రిగారు వీరి శిష్యులు మహా మహోపాధ్యాయ శ్రీ సుధాకర ద్వివేది మహాశయులు. వీరి శిష్యులు మహా మహోపాధ్యాయ, శ్రీ ఝోపాఖ్య మురళీధర్మ శర్మగారు, వీరి శిష్యులు జ్యోతిషాచార్య శ్రీ వే॥బ్రహ్మశ్రీ శ్రీపాద వెంకటరమణదైవజ్ఞ శర్మగారు అందరకు వందశతము లనర్పించి, వీరి శిష్యుడు మధుర శచీదేవీ వెంకయార్యదంపతుల ప్రథమపుత్రుడు మహామహోపాధ్యాయ కృష్ణమూర్తి శాస్త్రి నామధేయముకల నేను, నాద్వితీయ కుమారుడు,శిష్యుడు అగు దైవజ్ఞ పాలశంకర మూర్తి శర్మ ఉభయులము కలిసి గురూపదేశమార్గమున సూర్య సిద్ధాంతోక్త గణితప్రక్రియ ననుసరించి దృక్తుల్య (దృగ్గణిత) పంచాంగమును రచించి ప్రకటించుచుంటిమి. ఆస్తిక మహాశయులు దీని సత్యత్వమును గ్రహించి, ఆచరించి సత్ఫలితములను పొందగలరని మనవి చేయుచుంటిమి.**

జ్యోతిశ్శాస్త్రప్రశంసా:-జ్యోతిశ్శాస్త్రంమహాపుణ్యం ప్రత్యక్ష మపిగోపితం॥చంద్రార్కౌసాక్షిణౌతత్రశ్రౌతస్మార్తాది సాధనం॥

**తా. జ్యోతిశ్శాస్త్రము గొప్ప పుణ్యమును కలుగచేయును. ప్రత్యక్షముగ నున్నట్లు కనుపించినను చాల రహస్యములతో కూడినది. ఈ శాస్త్రమునకు సూర్యచంద్రులే ప్రత్యక్షసాక్షులు. మరియు యీ శాస్త్రము శ్రౌత, స్మార్తాది సర్వకర్మలను ఆచరించుటకు సాధనముగ నున్నది.విశేషము:- వేదములందు విధించబడిన యజ్ఞాదులను చేయుటకు, స్మృతులందు మహర్షులు చెప్పిన క్రియలను చేయుటకు తిథి-నక్షత్ర-యోగ-కరణములు ముఖ్యము. ఈనాలుగు సూర్య-చంద్రుల సంబంధమువలన సాధించబడును.1 చంద్ర-సూర్యాంతరమువలన తిథినిసాధించుట 2 చంద్రుడేనక్షత్ర మందున్నాడో తెలుసుకొని నక్షత్రమును సాధించుట. 3 చంద్రసూర్యుల కలయిక వలన యోగమును సాధించుట 4 తిథి ప్రమాణములో సగభాగమును గ్రహించి కరణమును సాధించుట. 5 వారము శాస్త్రపరంపరగ గ్రహించబడును. ఈ 5 అంగములకు పంచాంగమనిపేరు. సమస్త కర్మానుష్ఠానములకు యీ 5 అంగములు ముఖ్యములు.**

స్కంధ త్రయాత్మకం శాస్త్ర మాద్యం సిద్ధాంత సంజ్ఞకం॥ద్వితీయంజాతక స్కంధం తృతీయం సంహితా హ్వయమ్॥

**తా. జ్యోతిశ్శాస్త్రము 3భాగములుగనున్నది.1సిద్ధాంతభాగము 2 జాతకభాగము 3 సంహితా భాగము అనబడుచున్నది.**

వేదాస్తావద్యజ్ఞ కర్మప్రవృత్తాయజ్ఞాః ప్రోక్తాస్తేతు కాలాశ్రయేణ॥శాస్త్రాదస్మాత్కాల బోధోయత స్స్యాద్వేదాంగత్వం జ్యోతిష స్యోక్తమస్మాత్॥

**తా. వేదములు యజ్ఞములను చేయవలయునని చెప్పుచున్నవి. యజ్ఞములు కాలాధీనములై యున్నవి. అనగా ఏ కాలమందు యే యజ్ఞము చేయవలెనో తెలుసుకొనవలెను. అట్టి కాలమును జ్యోతిశ్శాస్త్రము తెలుపును. కాలమును తెలియచేయునది గనుక యీ శాస్త్రము వేదాంగమైనది.**

శబ్ద శాస్త్రం ముఖం జ్యౌతిషం చక్షుషీశ్రోత్రముక్తం నిరుక్తం కల్పఃకరౌ॥
యాతు శిక్షాస్య వేదస్యసానాసికా పాద పద్మద్వయం ఛందాద్యై ర్బుధైః॥

**తా. పూర్వపు ఋషీశ్వరులు వేదములకు శబ్ద (వ్యాకరణ) శాస్త్రము ముఖమని, జ్యోతిషము రెండు నేత్రములని, నిరుక్తము చెవులని, కల్పము చేతులని, శిక్ష వేదమునకు ముక్కు అని, చంధస్సు రెండుపాదములని తెలిపిరి. విశేషం:- వేదాంగములు 6గ నున్నవి 1 శిక్ష 2 వ్యాకరణం 3 ఛందస్సు 4 నిరుక్తము 5 జ్యోతిషము 6 కల్పము అని వాని నామములు.**

వేద చక్షుఃకిలేదం స్మృతం జ్యోతిషం ముఖ్యతాంగేషు మధ్యేస్యకే నోచ్యతే॥
సంయుతోపీతరైః కర్ణనాసాది భిశ్చక్షుషాంగే నహీనోన కించిత్కరః॥

**తా. జ్యోతిశ్శాస్త్రము వేదమునకు నేత్రములని చెప్పుటచేత సర్వాంగములలోను అతిముఖ్యమైనదిగ చెప్పబడెను. ఏ మనుజుడైనను ముక్కు,చెవులు కాళ్ళు,చేతులు మొదలైనవి కలవాడైనను నేత్రములేనివాడు (గ్రుడ్డివాడు) లోకములో ఎందుకును పనికిరాడో అట్లే కాలబోధక శాస్త్రములేనిదే వేద ములు కూడ అట్లే అగును. అనగా ఉపయోగములేకుండ వుండును అని భావము.**

అథ దైవజ్ఞలక్షణం।అద్వేషీ నిత్యసంతోషీ గణితా గమపారగః।

ముహూర్తగుణదోషజ్ఞో వాగ్మీకుశల బుద్ధిమాన్‌శాంతశ్చామృత వాక్సౌమ్యః త్రికాలజ్ఞో జితేంద్రియః। నిత్యకర్మరతో యోవై సదైవజ్ఞః ప్రకీర్తితః॥

**తా. దైవజ్ఞుడు ద్వేషములేనివాడు, నిత్యము సంతోషము కలవాడు, గణితశాస్త్రమును సమగ్రముగ నేర్చినవాడు, ముహూర్తములందుగల గుణ దోషములను బాగుగ తెలిసినవాడు, మంచివాక్కు కలవాడు, క్షేమమును తలంచు బుద్ధికలవాడు, శాంతచిత్తముకలవాడు, సౌమ్యుడు, భూతభవిష్య ద్వర్తమానములను తెలిసినవాడు. ఇంద్రియనిగ్రహము కలవాడు, నిత్యకర్మానుష్ఠానమును చేయువాడునై యుండవలెను.**

దశదిన కృతదోషంహంతి సిద్ధాంత వేత్తా త్రిదిన జనితమంహస్తంత్ర వేత్తానరాణామ్॥

కరణభగణ వేత్తాచైకరాత్రోత్థపాపం జనయతి బహుపాపం చైవనక్షత్ర సూచీ॥ నక్షత్రసూచీలక్షణం॥

**తా. సిద్ధాంత గ్రంథములను (సూర్య,బ్రహ్మ,వసిష్ఠాది సిద్ధాంత గ్రంథములను) బాగుగ చదివినవాడు 10 దినములలో చేసిన పాపమును పోగొట్టువాడు, తంత్ర గ్రంథములను చదివినదైవజ్ఞుడు 3 దినముల పాపమును పోగొట్టు శక్తికలవాడు, కరణ గ్రంథములను, గ్రహ భగణాది గణితమును నేర్చినవాడు, 1రోజు పాపమును పోగొట్టువాడు అగును. (ఇట్టి వారిని ఎవరు దర్శించెదరో వారి పాపములను పోగొట్టువారని భావము) నక్షత్ర సూచి యగు వానిని చూచినచో ఎక్కువ పాపము వచ్చును.**

నక్షత్ర సూచీ లక్షణము - నక్షత్ర సూచి అనగా ఎవరు?

అవిదిత్వైవ యశ్శాస్త్రం దైవజ్ఞత్వం ప్రపద్యతే॥ నక్షత్రసూచీ స భవేత్సర్వకర్మ బహిష్కృతః।

అగణిత సాంవత్సరిక షడ్గుణ హీనస్తు జగతియో మంత్రీ॥ శాస్త్రవిహీనో వైద్యస్త్రయశ్చ పురుషాభవంతి యమదూతాః॥

**తా. జ్యోతిశ్శాస్త్రమును గురుముఖతః ఎవరు చదువకుండ దైవజ్ఞుడని చెప్పుకుంటారో వానిని నక్షత్ర సూచి అందురు. ఇట్టివాడు సర్వ కర్మలయందు అనర్హుడుగ బహిష్కరింపబడును. గణిత శాస్త్రమును తెలియని దైవజ్ఞుడు, షడ్గుణ సంపదలేని మంత్రి, వైద్యశాస్త్రమును చదువకుండ వైద్యం చేయువాడు, యీ ముగ్గురు యమ దూతలుగ చెప్పబడినారు.**

రాజ్ఞో దైవజ్ఞ పూజాప్రకారః॥ యస్తుసమ్యగ్వి జానాతి హోరాగణిత సంహితాః అభ్యర్చస్స నరేంద్రణ స్వీకర్తవ్యోజయైషిణా। అప్రదీపా యథారాత్రి రనాదిత్యం యథానభ। తథా సాంవత్సరో రాజాభ్రమత్యంధ ఇవాధ్వని॥ నా సాంవత్సరికే దేశేవస్తవ్యం భూతి మిచ్ఛతా । చక్షుర్భూతోహి యత్రైషః పాపం తత్ర న విద్యతే। తస్మా ద్రాజ్ఞాధిగం తవ్యోవిద్వాం త్సాంవత్సరాగ్రణీః। జయామాయుః శ్రియంభోగా యశస్స మను భీప్సతా॥ అబ్దాదౌ ప్రాతరుత్థాయ దంతధావన పూర్వకం। స్నాన సంధ్యాధికం కృత్వా వర్ణాచార క్రమేణచ। అబ్దాదౌ మిత్ర సంయుక్తో మంగళ స్నాన మాచరేత్। వస్త్రైరాభరణైః దేహమలం కృత్యతతశ్శుచిః। ఉదఙ్ముఖో ప్రాఙ్ము ఖోవా దైవజ్ఞస్యతు సన్నిధౌవిఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞం బ్రాహ్మణాన్ గురూన్ । సంపూజ్య వత్సరఫలం సాంగో పాంగం యథాక్రమమ్॥ వికాస వదనో ధీమాన్‌సమ్యక్ జ్ఞాత్వాఫలంలభేత్ । యద్వర్షాదౌనింబ కుసుమశర్క రామ్లఘృతైర్యుతం॥ భక్షితంపూర్వ యామేస్యాత్తద్వర్షం సౌఖ్య దాయకమ్. శ్రీ మహాగౌతమీ తీర్థస్థరాజమహేంద్ర నగర్యాః ద్వాదశాం గుళశంకుజనిత విషువచ్ఛాయాంగుళాని 3-52 యల్లంకో జ్జయనీ పురోపరి కురుక్షేత్రాది దేశాన్ స్పృత్సూతం మేరు గతంబు ధైర్నిగదితా సామధ్యరేఖాభువ ఇత్యుక్త భూమధ్యరేఖాతః ప్రాగ్దేశాంతర వినాడికాః 61 పరమ దినప్రమాణం 32-33 పరమక్షయ దినప్రమాణం 27-37.

**తా॥ పూర్వము జయమును అపేక్షించే మహారాజులు తమ ఆస్థానములోనున్న దైవజ్ఞుని (జ్యోతిషశాస్త్ర పండితుని)ని గౌరవించి పూజించేవారు. నేటిపరిపాలకులు తమ పరిపాలనలో నున్న రాష్ట్రమునందు ముఖ్యమంత్రివర్యుల సమక్షములో జాతక, సిద్ధాంత, సంహితలందు సమగ్రమైన జ్ఞానముకల జ్యోతిశ్శాస్త్రజ్ఞుని పూజించవలెను. దీపములేని రాత్రి యందు, సూర్యదర్శనము కాకుండ చీకటి కమ్మిన పగటియందు వస్తువులను గ్రుడ్డివానివలె వెతికినట్లు దైవజ్ఞుడు (మార్గదర్శకుడు)లేని రాజు కూడ గ్రుడ్డివాడిగా వీధిలో తిరిగినట్లు తిరుగును. ధర్మబద్ధమైన సకలైశ్వరములను కోరు వారు దైవజ్ఞుడులేని దేశమందు నివసింపరాదు. నేత్రస్థానీయుడైన దైవజ్ఞుడెక్కడ వుండునో అక్కడ ఏవిధమైన పాపమున్ను ఉండదు. పై కారణములవలన జయము, ఆయువు, సంపదలు, భోగము యశస్సును కోరుకొను ప్రభువు దైవజ్ఞుని తప్పక పొందియుండవలెను. సంవత్సరాది దినమున ఉ దయముననే నిద్రనుండి లేచి దంతధావనాదికముతో స్నానము చేసి, వారి వారి వర్ణాచార క్రమముగ సంధ్యావందనాదికమును కూడ పూర్తిచేసిన తరువాత, మిత్రులతో కూడినవాడై అభ్యంగన స్నానమును (తలను అంటుకొనుట) చేయవలెను. మధుమాసమనగా చైత్రమాసము ప్రవేశించగానే, ఆనాటి శుద్ధ పాడ్యమిరోజున సూర్యదర్శనమైన తరువాత ప్రతిమనుజుడు తన స్నేహితులతో కలసి అభ్యంగన స్నానమును చేయవలెను. స్నానమైన పిమ్మట నూతన వస్త్ర-ఆభరణాదులతో దేహమునలంకరించుకొని, శుచిమంతుడై దైవజ్ఞుని సమీపమందు తూర్పు లేక ఉత్తరముఖమున ఆసీనుడై విఘ్నేశ్వరుడును-సరస్వతిని-రవ్యాదిగ్రహములను-దైవజ్ఞుడను-గురువులను వీరినందరిని పూజించి, సాంగోపాంగముగ సంవత్సర ఫలమును వికాసవదనుడై బుద్ధిమంతుడై సావధానముగ బాగుగ తెలుసుకొని మంచి ఫలితములను పొందవలెను. ఈనాడే(సంవత్సరాది)మొదటి యామములో ననగా ఉదయము 9గం॥లలోపుగ, పటికబెల్లం,చింతపండు, నెయ్యితో కలిపిన వేపపూవును తినినచో ఆ సంవత్సరమంతయు సుఖము కలుగును.**

**మహాగౌతమీ నదీతీరమందు గల రాజమహేంద్రనగరమునకు ద్వాదశాంగుళ శంకువువలన కలిగిన విషువచ్ఛా యాంగుళములు 3-52' లంక-ఉజ్జయిని పట్టణముల మీదుగ కురుక్షేత్రాది దేశములను తగిలిన సూత్రమేరు వును చేరునను పండిత వచనములచేత యీ రేఖ భూమధ్య రేఖయి చెప్పిన రేఖ నుండి తూర్పుగ దేశాంతర వినాడికలు (విఘడియలు) 61. ఇక్కడ పరమ దిన ప్రమాణము 32 ఘ-33 వి॥ఘ॥ పరమ క్షయదిన ప్రమాణము 27 ఘ 37 వి॥ఘు॥లు.**

మేషాది రాశుల ప్రమాణము (రాజమండ్రి ప్రాంతమునకు)

మేషస్య: 4-20 వృషభస్య:4-56, మిథునస్య:5-26, కర్కటకస్య:5-31, సింహస్య: 5-20 కన్యాయాః:5-15 తులాయా: 5-24, వృశ్చికస్య:5-33, ధనుషః: 5-19; మకరస్య: 4-43; కుంభస్య: 4-11, మీనస్య: 4-2.

# ముఖపత్ర వివరణ - ఉగాది ఎప్పుడు ?

మానవ జీవితానికి పంచాంగం అనునది ఒక మాన్యువల్ వంటిది. ప్రాణంవున్న యంత్రములాంటి ఈ మానవజీవితాన్ని దీర్ఘకాలం, ఆరోగ్య,సుఖ సంతోషాలతో గడుపుతూ దుఃఖాలను అధికమించుకొంటూ ధనాన్ని, కాలాన్ని సద్వినియోగ పరచుకొనుటకు మనము చేయు అర్థవంతమైన వివిధ షోడశ లౌకిక (పనులకు) కర్మలకు పంచాంగం వుపదేశించిన కాల నియమములను అనుసరిస్తూ నిర్వహించుకొనమని మన మహర్షులు మనకిచ్చిన అద్భుతమైన మాన్యువల్‌యే మన పంచాంగ విధానము.

నేడు పంచాంగాలకు విపరీత ఆదరణ పెరుగుటకు ముఖ్య కారకులు అయిన ప్రతికూల సంఘాలు, మీడియా వారికి మన వైదిక జీవనులు కృతజ్ఞతలు తెలుపుకోవలసిన అవసరం వుంది. ఎందుచేతనంటే గత 30 సం॥రముల నుండి పరిశీలన చేయగా ఏటికి ఏడాది పంచాంగముల వినియోగము కులమతభేధం లేకుండ అన్ని వర్గాల ప్రజలు ఆచరించేలా చేసినవారు వారే. అందులోను ముఖ్యకారకులయిన జనవిజ్ఞాన వేదిక మరియు టివి.9. వారు చర్చల పేరిట, జ్యోతిషశాస్త్రం శాస్త్రమే కాదని, ముహూర్తం మూఢనమ్మకం, వాస్తు అశాస్త్రీయం అనే ప్రతికూల నినాదాలతో ప్రతినిత్యం వారి విలువ అయిన ధనాన్ని కాలాన్ని వినియోగించుటచేత ఈ శాస్త్రాలు తెలియని కులాలు, నమ్మకాలు లేని మతాలు, ఈ శాస్త్రాన్ని వారి జీవితాలలో ముఖపత్రంపై వేసిన చిత్రముల సందర్భాలలో మమేకం చేసికొనుట వలన వారు ఊహించిన దానికి భిన్నంగా మన వైదిక వృత్తులను పెంచి పోషిస్తున్నారు. అందుచే మనమందరం ప్రతికూల మీడియా వారికి కృతజ్ఞతలు తెలుపుకొనుట మంచిది.

**షోడశ సంస్కారముల గురించి సంక్షిప్త పరిచయము చేసుకుందాం!**

వేదశాస్త్రములచే ప్రతిపాదింపబడిన షోడశ సంస్కా రములయొక్క ప్రాశస్త్యము వర్ణింపనలవికానిది. ఈ పదునారు సంస్కారములు ఏవో వాని మహిమ ఎట్టిదో, తెలిసికొనుట కర్మభూమి యందు పుట్టిన మనకు విధియైయున్నది. వర్ణాశ్రమ ధర్మములను పాటించువారు ఈ షోడశ కర్మలను నేటికీ ఆచరించుచూ సుఖమును పొందుచున్నారు. చాలామందికి అవి ఎందుకు చేయబడు చున్నవో వాని వలన కలుగు లాభములేవో, వానిని ఆచరించనిచో వచ్చు నష్టములేవో తెలియును. కనుక షోడశ కర్మలను గూర్చి తెలిసికొని ఆచరించి ఐహిక-ఆముష్మిక సుఖములను అందరూ పొందవలె నని ఈ వ్యాసము వ్రాయుచున్నాను.

ఈ సంస్కారముల సంఖ్యా విషయముతో మత భేద ములు కలవు. అయినను వ్యాసమహర్షిచే వ్రాయబడిన షోడశ సంస్కారములతోనే అవి అన్నియూ అంతర్భూత ములగుచున్నవి.

**సంస్కారముల నామములు :** 1. ఆధానము (గర్భాదానము) 2.పుంసవనము, 3. సీమంతోన్నయనము 4. జాతక కర్మ 5. అన్నప్రాశ నము 6. చౌలము 8. ఉపనయనము 9. బ్రహ్మవ్రతము 10. వేదవ్రతము 11. సమావర్తనము 12. వివాహము 13. అగ్న్యాధానము 14. దీక్షా 15. మహావ్రతము 16. సన్న్యాసము.

వీనిలో మొదటి ఎనిమిది సంస్కారములు ప్రవృత్తికి సంబంధించినవి. మిగిలిన ఎనిమిది సంస్కారములు నివృత్తికి సంబంధించినవి.

**1. గర్భాధానము :** షోడశ సంస్కారములలో మొదట పేర్కొనబడినది. గర్భాదానము. దీనినే 'ఆధానము" అని అందురు. సంతా నము తల్లితండ్రుల యొక్క ఆత్మ హృదయము, శరీరము నుండి జనించును. అందువలన మాతా పితరుల స్థూల, సూక్ష్మ శరీరములయందు ఏ ఏ దోషములుండునో, ఆయా దోషములు వారి వారి సంతానమునకు కూడ సంక్రమించును. కనుక మాతా పితరులు మంచి కాల మందు సత్వగుణమును అవలంబించి, మనస్సులో దైవ భావనతో సంతానోత్పత్తిలో ప్రవర్తించవలెను. ఈ విషయమునే కృష్ణుడు కూడ గీతల "ధర్మావిరుద్ధో భూతేషు కామో2స్మిభరర్షభ" (మనుష్యుల యందుండు ధర్మ విరుద్ధము కాని కామము తానై ఉన్నాను) అని చెప్పినాడు. తల్లి తండ్రుల చిత్త వృత్తుల ననుసరించియే సంతానము యొక్క మనస్సు, శరీరము మున్నగునవి ఏర్పడునని తెలుపుచూ...

ఓం పూషాభగం సవితామే దదాతు, ఓం విష్ణుః యోనిం కల్పయతు ఇత్యాది మంత్రములు గర్భాదాన సంస్కార సమయమందు పఠింపబడుచున్నవి. ఇదియే ఈ సంస్కారమందు తెలియదగినది.

దురదృష్టవశముచే ఇప్పటి కాలములో ఈ సంస్కార మందు సాత్విక భావము, దైవీ భావన లోపించుటచే, పశువుల వలె ధర్మ విరుద్ధమైన కామమే రాజ్యమేలు చున్నది. అందువలన శక్తిహీనులు దుష్టులు, స్వార్థపరులు కాముకులు జన్మించుచున్నారు.

**2. పుంసవనము :** రెండవ సంస్కారమునకు 'పుంసవనము' అని పేరు. ఈ సంస్కారము గర్భరక్షణార్థము ఏర్పడినది. మూడవ నెల మొదలు నాల్గవ నెల వరకు, ఆరవ నెల నుండి ఎనిమిదవ నెలవరకు ఉండు కాలము గర్భమందుండు శిశువునకు విశేషముగా నష్టమును నివారించుటకు ఈ సంస్కారము చేయబడును. ఇది మూడవ నెలలో మొదటి పది దినములలో చేయవలెను. పుంసవన పదమునకు "పుత్ర సంతతి కనుట" అని అర్థము. నాలుగు నెలలకు పూర్వము శిశువునకు స్త్రీ చిహ్నములు గాని, పురుష చిహ్నములు కాని సాధారణముగా ఏర్పడవు. ఇట్టి చిహ్న ములు తెలియబడక ముందే పుంసవన సంస్కారము విధింపబడినది. ఈ సంస్కారము వలన గర్భవతికి భయము, చింత, బడలిక, దుఃఖము నశించి గర్భ పోషణకు తగిన బలము కూడ చేకూరును. మరియు యోని యందుండు మాలిన్యాది దోషము తొలగిపోవునని సుశ్రుతాది ఆయుర్వేద గ్రంథములు తెలుపుచున్నవి.

**3. సీమంతోన్నయనము :** ఈ సంస్కారము కూడ గర్భరక్షణ కొరక ఏర్పడినది. గర్భధారణమైన తరువాత ఆరవనెలలోగాని ఎనిమిదవ నెలలో గాని ఈ సంస్కారము జరుపబడు చున్నది. ఇందు కొన్ని మంత్రముల ద్వారా స్త్రీల పాపట యందలి కొన్ని వెంట్రుకలను శృంగారపు ఆలోచనలు రాకుండుటకై భర్త తొలగించును. తరువాత సుగంధ ద్రవ్యములు పూసుకొనుట, భర్తతో కూడుట ఎంత మాత్రము పనికి రాదు. అప్పుడు గర్భము ధరించియున్న స్త్రీ ప్రసన్నమైన మనస్సుతో కామము మొదలగు గుణములు తీవ్రత లేక ఉండును. ఆమెకు కలుగు సంతానము సద్గుణ సంపత్తి, దీర్ఘాయువు, ధార్మికబుద్ధి కలవారు అగును.

**4. జాతకర్మము :** ఈ సంస్కారము శిశువు భూమిపై పడిన తరువాత చేయునది. దీనిలో తండ్రి మొదట యవపు పిండిని (ధాన్య విశేషము) బియ్యపు పిండిని, బంగారముపై రుద్దిన తేనెను, నెయ్యిని, శిశువు నాలుకకు మంత్రోచ్చా రణ జరుగుచుండగా తగిలించును. యవ,బియ్యపు పిండులవలన మేధ ఆయుర్దాయము సువర్ణ సంపర్కము వలన వాత దోషమును హరించుటయే కాక రక్తము యొక్క ఊర్ధ్వ గమనమును అరికట్టి, మూత్ర విసర్జన సక్రమముగా జరుగును. నెయ్యి, శరీరమునందు ఉష్ణ మును కలిగించి, బలమును వృద్ధి పొందించును. తేనె శరీరమును కాంతివంతముగా చేసి కఫదోషమును తగ్గించి నోటిలో చొంగ వృద్ధిచేసి జీర్ణవ్యవస్థను వృద్ధి పరచును. అందువలననే నేటి వైద్యులు కూడ కొంత మార్పుచేసి తేనె, ఆముదము కలిపిన ఆముదమును ఇచ్చి శిశువు శరీరమందలి అనేక మాలిన్యములను తొలగించుచున్నారు. ఈ జాతకర్మ సంస్కారము వలన తల్లితండ్రుల స్థూల శరీరముల నుండి కలిగిన అనేక దోషములు తొలగి పోవును

**5. నామకరణము :** శిశువు జన్మించి పదిరాత్రులైన తరువాత ఈ సంస్కా రము జరుపబడును. సాధారణముగా పది దినముల లోపునే శిశువులు మరణించుదురు. కనుక పది దిన ముల తరువాతనే ఈ సంస్కారము ఏర్పాటు చేయబడి నది. ఈ నామకరణమందు తండ్రి స్వయముగా శిశువు జననకాలమందలి గ్రహ నక్షత్ర అధి దేవతలకు, పూజా, జప, హెూమ, దానాదులు నిర్వర్తించి మంత్ర పురస్సర ముగా శిశువునకు నామకరణము చేసి దీర్ఘా యుష్మంతుని చేయుచున్నారు.

**6. అన్న ప్రాశనము :** ఈ సంస్కారము పుత్రుడైనచో ఆరవ నెలగాని, ఎనిమిదవ నెలగాని పుత్రికయైనచో ఐదవ నెల గాని ఏడవ నెలగాని చేయబడుచున్నది. మంచి తిథి వార నక్షత్రములతో కూడిన శుభముహూర్తమందు అన్నప్రదాత అయిన సూర్యుడు నీకు అన్నమును, శుభమును కలుగ చేయుగాక అనుభావము కల మంత్ర పఠనము చేయుచూ తండ్రి శిశువు నోటిలో అన్నమును ఉంచును.

ఈ సంస్కారము వలన శిశువు మాతృగర్భ మందలి మాలిన్యమును తినుటచే కలిగిన దోషమును తొలగించు కొని, నిర్మలత్వమును పొందును.

**7. చౌలము :** ఈ సంస్కారమునకు "చూడాకరణము" అని మరియొక పేరు కలదు. మూడవ యేడు వచ్చిన తరువాత పుత్రునకు "నీకు ఆయువు, తేజస్సు, బలము, వృద్ధి పొందుగాక" అను అర్థము నిచ్చు మంత్రములతో శిఖ మాత్రము వుంచి తండ్రి మిగిలిన కేశములను తీసి వేయును. దీనివలన శిశువునకు అపాత్రత తొలగి

విద్యోప దేశమునకు యోగ్యత సమకూరును. "శక్త్యై శిఖాయై వషట్" అను శృతి ననుసరించి శక్తికొరకు శిఖపెట్టుకొని వారిని గౌరవించుట శిఖలేని వారిని దూషించుట మన ప్రాచీన శాస్త్ర సంప్రదాయమే కాక పాశ్చాత్య పండితులు (శాస్త్రజ్ఞులు) కూడ స్పష్టముగా దీనిని అంగీకరించు చున్నారు.

Strength was supposed to be in the hair and the cutting of it brought weekness to the body. Criminals who refused to confess, Even under torture have alone so when their hair was cut off. Sampson was power less when his locks were cut off.

వెంట్రుకలయందు బలము కలదు. వెంట్రుకలు పూర్తిగా తొలగించుట వలన దౌర్బల్యము కలుగును. అపరాధము చేసినవారు ఎట్టి శిక్షలనైనను అనుభవించే వారు. కాని తప్పులను మాత్రము అంగీకరించేవారు కాదు. శిరో ముండనము చేసి వారి దోషములను అంగీ కరింపచేసేవారు. ఇట్టి అనేక ప్రమాణములను బట్టి చూడగా ప్రాచీన కాలములో పాశ్చాత్య దేశములలో కూడ శిఖధరించు విధానము ఉండినట్లు తెలియుచున్నది.

మన మహర్షులు, శాస్త్రములందు, స్త్రీలు పురుషుల వలె కేశములను కత్తిరించుకొనుట స్థూల వ్యాయామము చేయుట పనికిరాదని ప్రాయశ్చిత్తాది విధులందు కూడ స్త్రీలకు 4 అంగుళముల వరకు మాత్రమే కేశములను కత్తిరించుటను విధించిరి. భర్త మరణించిన తరువాత మాత్రము పూర్తిగా శిరోముండనము "విధవాకబరీబంధో భర్తృ బంధాయజాయతే" విధింపబడినది. పాశ్చాత్య దేశములలోని స్త్రీలు కేశములను కత్తిరించుకొని స్థూల వ్యాయామము చేయుచుండుటచే వారి శరీర లావణ్యము తరిగిపోయి స్త్రీ సహజమైన మాతృభావమునకు కూడ దూరమగుచున్నారని ప్రసిద్ధ అమెరికా వైద్యుడు డా. గిలార్డ్ థామస్ చింతించుచూ వ్రాసినాడు. తరచుగా కేశ ఖండనము, గోళ్ళను కత్తిరించుకొనుట ముఖ క్షౌరము చేసికొనుట వలన పురుషుడు శక్తిహీనుడై కేవల భోగ లాలసుడు అగును. అందువలన మంచిరోజు, మంచి నక్షత్రము చూచి క్షౌరము చేసికొనవలెను. తరచుగా చేసికొనరాదు. అని సనాతన వైజ్ఞానికులు చెప్పుచున్నారు.

The Removal of hair and nails at the prescribed times helps the conservation and absorption of powers shed by the stars and the heavenly aspects of the days and the hours.

అందువలన చూడాకరణమును ఈ సంస్కారము హిందువులకు ఉత్తమ జాతీయ చిహ్నముగా పరిగణింప బడుచున్నది.

**8. ఉపనయనము :** ఈ ఉపనయనము, సంస్కారమయిన తరువాత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యబాలకులు విద్య ద్వారా జ్ఞాన మును సంపాదించుట కొరకు ఆచార్యుని సమీపమునకు వచ్చెదరు. కనుక దీనిని 'ఉపనయనము' అని అందురు. మాతురగ్రే అధిజననం, ద్వితీయం మౌంజిబంధనాత్

బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు మొదటిజన్మ తల్లిగర్భము నుండి రెండవ జన్మ ఉపనయన సంస్కారము వలన కలుగును. వసన్త ఋతువునందు సత్వగుణ ప్రధానులైన బ్రాహ్మణ బాలకులకు ఎనిమిదవ ఏట, గ్రీష్మఋతువు నందు తీక్షణ ప్రకృతి కల క్షత్రియులకు 11వ ఏట, శరదృతువునందు పోషణ శక్తి కల వైశ్యులకు 12వ ఏట ఉ పనయనము శాస్త్రసమ్మతము. ఉపనయన సంస్కార ముతో యజ్ఞోపవీతధారణ ముఖ్యము. యజ్ఞోప వీతము నందు తొమ్మిది పోగులు, మూడు బ్రహ్మముడులు ఉండును. తొమ్మిది పోగుల యందు (తంతువుల యందు) తొమ్మండుగురు దేవతలు అధిష్ఠించి ఉందురు. మొదటి తంతువు యందు ఓంకార తత్వమైన బ్రహ్మ జ్ఞానము, రెండవ తంతువు యందు అగ్ని తత్త్వమైన తేజస్సు, మూడవతంతువు యందు అనంతుని తత్వమైన ధైర్యము, నాల్గవ తంతువు యందు చంద్రుని తత్వమైన సర్వప్రియత్వము, ఐదవ తంతువు యందు పితృగణము యొక్క తత్వమైన స్నేహశీలత, ఆరవ తంతువుయందు ప్రజాపతి తత్వమైన ప్రజారక్షణము, ఏడవ తంతువు యందు వాయుతత్వమైన బలము, ఎనిమిదవ తంతువు యందు సూర్యుని తత్వమైన ప్రకాశము, తొమ్మిదవ తంతువు యందు సర్వదేవతలు నివసింతురు. యజ్ఞోప వీత ధారణ ద్వారా పైన పేర్కొనిన తొమ్మిది దేవతలను సదా ధరించి పునీతులగుటయే కాక తత్వజ్ఞాన ప్రాప్తి, సదాచార సంపత్తి వినయాది సద్గుణ ప్రాప్తి కలుగును.

**9. బ్రహ్మ వ్రతము :** ఉపనయనమైన తరువాత చేయు సంస్కారమునకు బ్రహ్మ వ్రతమని పేరు. ఈ సంస్కారము నందు గురువు యొక్క గృహములో నివసించి బ్రహ్మచర్యమును పాటిం చుచూ, గురుశుశ్రూష చేయుచూ వేదాధ్యయనము చేయు టకు శిష్యుడు ప్రతిజ్ఞ చేయును. అందువలన దీనికి బ్రహ్మ వ్రతమని పేరు వచ్చినది. ఇందు బ్రహ్మచర్యము, గురు శుశ్రూష, వేదాధ్యయనము ప్రధానముగా ఉండును.

**10. వేద వ్రతము :** ఈ సంస్కారములో శుభముహూర్తమందు వేదము వేదాంగములు (శిక్షా వ్యాకరణము, ఛందస్సు నిరుక్తము, జ్యోతిషము,కల్పము) ధర్మశాస్త్రములు. అర్థముతో కూడ అధ్యాపనము ప్రారంభింపబడును. వేదముయొక్క మహత్తు స్మృతిసార సముచ్చయ గ్రంథమందు ఇట్లు వర్ణింపబడి నది.

వేదోయస్య శరీరస్థోన సపాపేన లిప్యతే । వేదాత్మాసతు విజ్ఞేయః శరీరైః కిం ప్రయోజనమ్ ॥

వేదాధ్యయనము చేసిన వానికి పాపము సోకదు. అతడు వేదమునకు ఆత్మవంటివాడు. వేదాధ్యయనము లేని శరీరము వలన ప్రయోజనము లేదు. అర్థము లేని వేదాధ్యయనము నిష్ఫలమని పరాశర మహర్షి వచించి నాడు. శుక్ల కృష్ణపాడ్యములు, చతుర్థశులు, అష్టములు, పూర్ణిమా అమావాస్యలందు వేదాధ్యయనమునకు నిషేధము. వేదాంగములు, ఇతిహాసములు, పురాణ ములు, ధర్మశాస్త్రములు పఠించుటకు నిషేధము లేదు.

**11. సమావర్తనము :** గురుని గృహమునుండి విద్య పూర్తిచేసికొని శిష్యుడు ఆచార్యునికి గురుదక్షిణ ఇచ్చి స్వగృహమునకు బయలు దేరునపుడు ఈ సంస్కారమును జరుపుదురు. ఆచార్యుని అనుమతితో ధర్మ సంతానోత్పత్తికై గృహస్థాశ్రమములో ప్రవేశించును. ఆచార్యుని నుండి గ్రహించిన విద్యకు ఎంత ధనము గురుదక్షిణగా సమర్పించిననూ, అతని ఋణము తీరదు, ఐనను లోకాచారము ననుసరించి బ్రహ్మచర్యము సమాప్తమైనట్లు గుర్తుగా గురుదక్షిణ సమర్పింపవలెనని హారితస్మృతి తెలుపుచున్నది.

**12. వివాహము :** మనువు మొదలగు స్మృతి ప్రణేతలు బ్రహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధ ర్వము, రాక్షసము, పైశాచము అను ఎనిమిది విధములగు వివాహములను తెలిపి, వీనిలో బ్రహ్మ దైవ ఆర్ష ప్రాజా పత్య వివాహములు శ్రేష్ఠములని తెలిపిరి. పాశ్చాత్యులు మరియు మహమ్మదీయులు క్రైస్తవులకు సంబంధించిన వివాహములతో స్థూల శరీరముల కలయిక తద్వారా ఆనందానుభూతియే ప్రధానముగా ఉ ండును. ఆధ్యాత్మిక సంబంధము ఉండదు. ధర్మ సంతానోత్పత్తి ద్వారా పితృ ఋణ విముక్తియే హిందూ వివాహమునకు ప్రధాన ప్రయోజనము.

**13. అగ్న్యా ధానము :** ఈ సంస్కారమందు పురుషుడు భార్యతో కూడి ప్రాత స్సాయంకాలముల యందు శ్రౌతాగ్ని యందు హోమము చేయును. దీనివలన శ్రద్ధ, మేధ, యశస్సు, ప్రజ్ఞ, విద్య, బుద్ధి, ఆరోగ్యము మొదలగునవి సిద్ధించును. మరియు ఈ సంస్కారము ద్వారా "బ్రాహ్మీయం క్రియతే తనుః"

( ఈ శరీరము బ్రహ్మబోధకు అనుకూలముగా చేయ బడుచున్నది. అనువచనమును అనుసరించి అగ్ని యొక్క అనుగ్రహమును సంపాదించుట ద్వారా గృహ యజమాని యొక్క అనుగ్రహమును సంపాదించుట ద్వారా గృహ యజమాని యొక్క మనస్సు ఐహిక విషయముల నుండి మరలి ఆధ్యాత్మిక విషయముల పట్ల ప్రవర్తించును.

**14,15 దీక్షా – మహా వ్రతములు :** గృహస్థాశ్రమ మందు చేయబడు సంధ్యావందన దేవతార్చనాది నిత్యకర్మలు, వ్రతోపవాసాది నైమిత్తిక కర్మలు గృహస్థుని మనస్సుయందు ఐహిక సాంసారిక వ్యవహారముల పట్ల విరక్తిని పెంచి ఆముష్మికమైన మోక్ష సాధనమందు కోరిక కలిగించును. అట్టి సమయమందు గృహస్థుని యొక్క వైరాగ్య ప్రవృత్తి గుర్తించి సద్గురువు దేవతా మంత్రోపదేశము చేసి దీక్షా సంస్కారమునకు నాంది పలుకును.

అపుడు గృహస్థు తన సాధన ద్వారా నిత్యానంద మును ప్రసాదించు బ్రహ్మానుభూతిని పొందును. తరువాత కొంతకాలమునకు వానప్రస్థాశ్రమమును స్వీకరించుటకు అర్హతను పొందును. ఆ సమయమందు స్వీకరించిన మహా వ్రత సంస్కారము ద్వారా పరబ్రహ్మ సాధకము లయిన ఉపదేశములు చేయబడును. ఈ విధముగా దీక్షా మహావ్రత సంస్కారముల ద్వారా గృహస్థు యొక్క ఆధ్యాత్మిక శక్తి వృద్ధి పొందును. అజ్ఞానావరణము తొలగును.

**16. సన్న్యాసము :** కోరికలతో చేయు కర్మలు (సకామ కర్మలు) సంతా నోత్పాదన యందు ఆశ, ధన సంపాదన యందు ఆశ మొదలగునవి అన్నియు నశించిన తరువాత సాధకుడైన గృహస్థునకు సన్యాసాశ్రమ స్వీకార యోగ్యత కలుగును. ఈ ఆశ్రమమందు ఉపాసన ద్వారా ఇంద్రియ నిగ్రహ మును తద్వారా చిత్త వృత్తులను

నిరోధించి ఆత్మ జ్ఞాన ముసు సమత్వ బుద్ధిని పొందును. చివరకు నిర్గుణ పరమాత్మయందు జీవుడు లయ మును పొందును. ఇదియే సన్యాసాశ్రమ సంస్కారము యొక్క పరమ లక్ష్యము. ఈ ఆశ్రమము జీవన్ముక్తికి సాధనమని ఆశ్రమములన్నింటిలో గొప్పదని శ్రుతులు, స్మృతులు గూడ ఘోషించుచున్నవి.

ఈ విధముగా మానవ జీవనమందు ఐహిక సుఖము లకు, ఆముష్మిక సుఖమునకు సాధన భూతములైన షోడశ సంస్కారములను లౌకిక కర్మలైన వృత్తి, వ్యాపారము మొ॥గు వాటితో కూడిన జీవనము ఆయా కాలముల యందు యధావిధిగా ఆచరించి మానవుడు జన్మ సాఫల్యతను పొందుటకు సశాస్త్రీయమైన గణిత విధానముతో కూడిన పంచాంగమును ఆచరించినచో నష్ట,కష్ట,దుఃఖాలను అధికమించి ఆనందకరమైన జీవనమునకు బాటవేసుకున్నవారగుదురు. (కృతజ్ఞతలతో : శ్రీ పి.జె.శర్మ)

రాబోవు హేమలంబనామ సం॥ర ఉగాది ఎప్పుడు? అను విషయ ముపై తిరుమల తిరుపతి దేవస్థానంవారు 29-3-2017 గాను; భారతప్రభుత్వము వారి రాష్ట్రీయ పంచాంగ సంస్థ నుండి వెలువడుతున్న తేది 28-3-2017గాను వారి వారి పంచాంగాలలో ఉగాదులు తెలిపినారు. గతంలో కూడ ఇటువంటి వ్యత్యాసాలు వచ్చిన సందర్భాలు కోకొల్లలు. గత ఏడాది దుర్ముఖ నామ సం॥ర పంచాంగం 3వ పేజీనందు ఆంధ్ర ప్రదేశ్‌లోగల 4 రకాల పంచాంగాలకు గల తేడాలను సోదాహరణముగా చూపడమైనది.

## హేమలంబ నామ సంవత్సర ఉగాది 29-3-2017 నాడే సరియైనది.

రాబోవు హేమలంబనామ సం॥ ఉగాది 28-3-2017 లేక 29-3-2017 తేదీలలో ఏ దినమున జరుపుకొనవలెను? అను సందేహం వరాహమిహిరులవారి గురు పరంపరలో శ్రీ మధురకృష్ణమూర్తి శాస్త్రిగారి గణిత రీత్యా ఈక్రింద వివరముగా తెలియ పరచడమైనది. శ్రీ కేరో లక్ష్మణ ఛత్రేగారి "గ్రహణోశేం కోష్ఠకా" మరియు శ్రీ వేంకటేశబాపుజీశాస్త్రి కేత్కార్‌గారి జ్యోతిర్గణితంను అనుసరించి, అయనాంశ సాధన (వార్షిక అయనగతి 0'-0¹-50.27") అబ్దపుడి సాధన, సాయన గ్రహసాధన నుండి నిరయన గ్రహసాధన, సాధించి, స్పష్ట,రవి,స్పష్ట చంద్రుల నుండి తిథి, సాధించుచున్నాము. హేమలంబనామ సం॥ర ఉగాది శాస్త్రీయ దృగ్గణిత సౌరాది సర్వ సిద్ధాంత సమ్మతములైన ఛాయార్క సంస్కృతకరణార్కానీతములైన గణితము రీత్యా తేది 29-3-2017 అని క్రింది గణితము నందు నిస్సందేహముగా వివరించుచున్నాము.

**27-03-2017 దుర్ముఖ ఫాల్గున బ॥ చతుర్దశి సోమవారం.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్పష్ట చన్ద్రః | 11-3-39-56 | గతి | 833-48 | 0'-0¹-49" = | ఘ.వి.ఘ |
| స్పష్ట రవి | 11-15-40-35 | గతి | 59-21 | 774-27 | 0 - 4 |
| | 11-17-59-11 | గతిబేధం | 774-27 | | |
| 28తిథుల | 11-06- 0- 0 | | ఘ - వి.ఘ | | |
| | 0-11-59-11 | | 0-4 చతుర్దశి శేషం | | |
| తిథి | 12-0-0 | | 15-10 దినార్ధము | | |
| | 0-0-49 | | 15-14 చతుర్దశి తిథి | | |

**27-3-2017 నాడు చతుర్దశి ఘ 15-14 విఘ (మ12-09) వరకు గలదు. సూ.ఉ. 6-04; అస్త 6-12**

**2. 28-03-2017 దుర్ముఖనామ సం॥ర ఫాల్గున అమావాస్యమంగళవారం**

| | | | | |
|---|---|---|---|---|
| స్పష్ట చన్ద్రః | 11-17-33-30 | చన్ద్రగతి | 851-48 | ఘ.వి.ఘ |
| స్పష్ట రవి | 11-16-40-05 | రవిస్పష్టగతి | 59-19 | 15-10 దినార్ధము |
| బేధం | 0-0-53-25 | గతిబేధం | 792-29 | 4-3 |
| | | | అమావాస్య | 11-07 |

$2^0$-53'-25" ÷ 792-29 = ఘ 4-3 విఘ.

**28-03-2017 మంగళవారంనాడు ఘ 11-07 విఘ (ఉగం10-20ని) వరకు గలదు.**

**3. 29-03-2017 నాడు పాడ్యమి గణితం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్పష్ట చన్ద్రః | 0-01-45-03 | చన్ద్రగతి | 865-35 | ఘ.వి.ఘ | |
| స్పష్ట రవి | 11-17-39-25 | శనిస్పష్టగతి | 59-17 | 15-10 | దినార్థము |
| బేధం | 0-14-05-38 | గతిబేధం | 806-18 | 9-20 | |
| 1తిథిసరి | 12-0-0 | | పాడ్యమి | 5-50 | |
| పోవుచున్నది | 2-05-38 | | | | |

$2^0$-05'-59" ÷ 807-18 = ఘ 9-20 విఘ.

**29-03-2017 బుధవారంనాడు పాడ్యమి ఘ 5-50 విఘ (ఉగం8-24ని) వరకు గలదు.**

స్కాందపురణామునందు : యా శుక్ల ప్రతిపచ్చైత్రెమాసి సంవత్సరస్యసా పూర్వవిద్ధానకర్తవ్యా కర్తవ్యా పరసంయుతా ॥

వసిష్ఠులవారి వాక్యము: ప్రతిపద్వత్సరాదౌ తు దర్శవిద్ధాం నకారయేత్। పరేద్యురేవకర్తవ్యా ద్విముహూర్తా భవేద్యది ।
ముహూర్తగాపికర్తవ్యా ద్వితీయాసంయుతాయది

సంవత్సరాది పాడ్యమిని అమావాస్య విద్ధగానున్నప్పుడు గ్రహించరాదు. పరదిన మునపాడ్యమి రెండు ముహూర్తములున్ననూ (4ఘ.)పరదినమునే గ్రహించవలెను. ఒక్కముహూర్తమున్ననూ విదియతో కూడిన పాడ్యమిని గ్రహించవలెను.

ధర్మప్రవృత్తౌ : ఉదయే ప్రతిపచ్ఛేషం తన్నావమదినం యది తస్మిన్ దినేతు యోవారస్స ఏవాజ పతిర్భవేత్।సూర్యోదయ కాలమునకు పాడ్యమి ఉండి అవమ(క్షయము) కాకపోతే ఆ వారాధిపతి మేషాధిపతి అగును. అనగా సంవత్సరాధిపతి యగును. పై వివరములచేత హేమలంబనామ సం॥ర ఉగాది తేది 29-3-2017 బుధవారమగుట నిస్సందేహము. దృక్సిద్ధాంతము అని చెప్పుచున్న మిగతా విధానములన్నింటియందు స్పష్టగ్రహముల (స్పష్టరవిమొ.) నందు సంస్కారము సరిగా జరుగుటలేదనియు, ప్రత్యేకముగా అయనాంశ గణన దాని ద్వారా సూర్యునియొక్క వర్షగతిలో చేయవలసిన గణిత సంస్కారములు సవరించక పోవుటవలన అనేక రకములుగా బేధములు వచ్చుచున్నవి. కొందరు సాయనగ్రహములను సాధించి వాటినే దృక్సిద్ధాంత ములుగా చెప్పుచున్నారు. అదిఎంతవరకు వాస్తవమో విజ్ఞులు ఆలోచించుకొనగలరు. ఈఛాయార్క సంస్కృత కరణ్కా నీతములైన అయనాంశములే సరియగు దృక్సిద్ధాంతము అనుటలోసందేహములేదు. వీటిని అనుసరించి చేయుపంచాంగగణితము, (తిథి,వార,నక్షత్ర,యోగ,కరణ ములు) వ్రత,పండుగలు,ఆబ్దీకవిషయములు,విశేషాదులుశృతి,స్మృతికర్మలు(వేదోక్తమైనకర్మలకు)ఆచరణీయయోగ్యములు అనుసరించదగినవి.

ఈ పై చూపిన గణితవిధానములో ఎవరికైన సందేహములు ఉన్నచో ఈ పంచాంగ కర్త అయిన యం.పి.శర్మ - 9397919902 గారిని సంప్రదించి, సందేహ నివృత్తి చేసుకొనవచ్చును. అయినను ఎక్కడైన పంచాంగంలోగల గణిత, ధర్మశాస్త్రపరమయిన తప్పులు దొర్లినచో మాకు తెలుపగలరు. సహృదయంతో స్వీకరించుదుము.

ఇట్లు
**యం.పి.శర్మ**

## పాక్షిక చంద్రగ్రహణం

హేమలంబ నామ సంవత్సర శ్రావణ శుద్ధ పూర్ణిమ సోమవారం (7-8-2017) పాక్షిక చంద్రగ్రహణం శ్రవణం నక్షత్రం మరియు ధనిష్ట 1వ పాదము నందు (మకరరాశియందు) సంభవించును. కేతుగ్రస్తము ధూమ్ర వర్ణము. సోమవారమగుటచే చూడామణి నామకము. (అర్థాల్ప గ్రాసము)



| | | |
|---|---|---|
| సూర్యాస్తమయం | : | సా॥గం॥ 6-29 ని॥ |
| గ్రహణ స్పర్శకాలము | : | రా॥గం॥ 10-52 ని॥ |
| గ్రహణ మధ్యకాలము | : | రా॥గం॥ 11-49 ని॥ |
| గ్రహణ మోక్షకాలము | : | రా॥గం॥ 12-48 ని॥ |
| ఆద్యంత పుణ్యకాలము | : | గం॥ 1-56 ని॥ |

**నిత్యభోజన ప్రత్యాబ్దిక నిర్ణయము :** ధర్మ సింధువులో వివరణ.

రాత్రి ద్వితీయ యామమందు గ్రహణము సంభవించుటచేత, మధ్యాహ్నం 12లోపు నిత్యభోజన ప్రత్యాబ్దికాదు లను జరుపుకొనవలెను. రాత్రి భోజనము చేయకూడదు. వృద్ధులు, బాలురు, అన్నార్తుల విషయంలో రాత్రి 7 గంటలలోపు చేసుకొనవచ్చును.

**ఉపాకర్మ విషయమున :** 7-8-2017న చంద్రగ్రహణము చేత యజుర్వేదులు, వాజసనేయులు మొదట ఉపాకర్మ చేసుకొనుటకు పనికిరాదు. భాద్రపద పౌర్ణమినాడు చేసుకొనవచ్చును. మిగిలిన సామవేదులు 28-7-2017న చేసుకొనవలెను. ఋగ్వేదులు 3-9-2017 ఆదివారం శ్రవణా నక్షత్రంలో చేసుకొనవలెను.

## సంపూర్ణ చంద్రగ్రహణము

హేమలంబ నామ సంవత్సర మాఘ శుద్ధ పూర్ణిమ బుధవారం (31-01-2018) గ్రస్తోదయ సంపూర్ణ చంద్రగ్రహణము ఆశ్రేషా నక్షత్రయుక్త కర్కాటక రాశి యందు సంభవించును. రాహుగ్రస్తము, పింగళ వర్ణము.



| | | |
|---|---|---|
| సూర్యాస్తమయం | : | సా॥గం॥ 5-56 ని॥ |
| గ్రహణ స్పర్శకాలము | : | సా॥గం॥ 5-18 ని॥ |
| గ్రహణ నిమీనకాలము | : | సా॥గం॥ 6-21 ని॥ |
| గ్రహణ మధ్యకాలము | : | సా॥గం॥ 6-59 ని॥ |
| గ్రహణ ఉన్మీలకాలము | : | రా॥గం॥ 7-37 ని॥ |
| గ్రహణ మోక్షకాలము | : | రా॥గం॥ 8-41 ని॥ |
| ఆద్యంత మోక్షకాలము | : | 3 గం॥ల 23 ని॥లు |

**నిత్యభోజన ప్రత్యాబ్దిక నిర్ణయము :** ఈనాటి పగలు భోజనాదులు చేయకూడదు. ఆబ్దీకముల విషయములో మరునాడు చేసుకొనవలెను. బాలలు, వృద్ధులు, అన్నార్తులు ఉదయం 9 గం॥ల లోపు చేసుకొనవచ్చును.

గ్రహణ సమయములో స్నానం, దానం, హెూమం, మంత్రానుష్ఠాన ములు విశేషములు. వెండితో చంద్ర, రాహు (సర్ప) బింబములనుచేసి కంచు, రాగి పాత్రలో నెయ్యితోపాటు తిలలు, వస్త్రము సహితముగా గ్రహణ దోషము పోవుటకు దానమీయవలెను.

# దైవ ప్రార్థనలు

అన్నివేళలయందు సర్వ విఘ్నములకు, ఎటువంటి అవాంతరములకైననూ ఈ శ్లోకములు1,3,9,11,27,54,108, 1008సార్లు పఠించుటవలన కార్యవిజయములు, అష్ట ఐశ్వర్యములు కలిగి ఋణ, రోగ విముక్తులు కాగలరు.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

**నవగ్రహ స్తోత్రములు**

ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయచ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః

రవి॥ జపాకుసుమ సంకాశం । కాశ్యపేయం మహద్యుతిం।
తమోరిం సర్వపాపఘ్నం । ప్రణతోస్మి దివాకరం ॥

చంద్ర॥ దధిశంఖ తుషారాభం । క్షీరోదార్ణవ సంభవం ।
నమామి శశినం సోమం । శంభోర్మకుట భూషణం॥

కుజ॥ ధరణీగర్భ సంభూతం । విద్యుత్కాంతి సమప్రభం ।
కుమారం శక్తిహస్తం తం । మంగళం ప్రణమామ్యహం॥

బుధ॥ ప్రియంగు గుళికాశ్యామం । రూపేణ ప్రతిమం బుధం।
సర్వసౌమ్యగుణోపేతం ।తంబుధం ప్రణమామ్యహం ॥

గురు॥ దేవానాంచ ఋషీణాంచ । గురుంకాంచన సన్నిభం ।
బుద్ధిమంతం త్రిలోకేశం । తం నమామి బృహస్పతిం॥

శుక్ర॥ హిమకుంద మృణాలాభం । దైత్యానాం పరమంగురుం।
సర్వశాస్త్ర ప్రవక్తారం । భార్గవం ప్రణమామ్యహం ॥

శని॥ నీలాంజన సమాభాసం । రవిపుత్రం యమాగ్రజం ।
ఛాయామార్తాండ సంభూతం । తం నమామిశనైశ్చరం॥

రాహు॥ అర్ధకాయం మహావీరం । చంద్రాదిత్య విమర్దనం ।
సింహికాగర్భసంభూతం।తంరాహుం ప్రణమామ్యహం॥

కేతు॥ పలాశ పుష్ప సంకాశం । తారకాగ్రహ మస్తకం ।
రౌద్రంరౌద్రాత్మకంఘోరం।తం కేతుం ప్రణమామ్యహం॥

**నేత్ర దోషములు తొలగుటకు**

.......గోత్రస్య...........నామధేయస్య............నేత్ర సంబంధి సర్వవికార నివారణార్థం చాక్షుషోపనిషత్పారాయణ పూర్వక జపం కరిష్యే॥
ఓం ఆదిత్యాయనమః ఓం అస్య చాక్షుషోపనిషదః అహిర్బుధ్న్య ఋషిః సవితాదేవతా । గాయిత్రీ ఛందః చక్షూరోగ నివృత్తయే వినియోగః॥
ఓం చక్షుః చక్షుః చక్షుః తేజః స్థిరోభవ ।
మాంపాహిపాహి । త్వరితం చక్షూరోగాన్ శమయ శమయ।
మమజాతరూపం తేజో దర్శయ దర్శయ ।
యధాహం అంధోనస్యాం తథా కల్పయ కల్పయ।
కల్యాణం కురుకురు । యానిమమ పూర్వజన్మోపార్జితాని
చక్షుఃప్రతిరోధకదుష్కృతానిసర్వాణినిర్మూలయ నిర్మూలయ
ఓం నమః చక్షుస్తేజోదాత్రేదివ్యాయ భాస్కరాయ।
ఓం నమః కరుణాకరాయామృతాయ।ఓం నమస్సూర్యాయ
ఓం నమోభగవతే సూర్యాయాక్షితేజసేనమః ఖేచరాయనమః
మహతేనమః । రజసే నమః। తమసే నమః।
అసతోమాసద్గమయ । తమసోమా జ్యోతిర్గమయ ।
మృత్యుర్మా అమృతంగమయ । ఉష్ణోభగవాన్ శుచిరూపః
హంసో భగవాన్ శుచిర ప్రతిరూపః।
య ఇమాం చాక్షుష్మతీం విద్యాం
బ్రాహ్మణో నిత్య మధీతే న తస్యాక్షిరోగో భవతి ।
నతస్య కులే అంధోభవతి ।
అష్టౌ బ్రాహ్మణాన్ గ్రాహయిత్వా విద్యా సిద్ధిర్భవతి ॥
అనేన జపేన మమ అక్షిబాధా నివారణ మస్తు
ఏతత్ఫలం సర్వం శ్రీ సూర్య దేవతార్పణ మస్తు ॥

**ఉదయం నిద్రలేవగానే పఠించవలసినది**

కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ ।
కరమూలే స్థితా గౌరీ ప్రభాతే కర దర్శనమ్ ॥

**నదుల యందు స్నానముచేయునపుడు**

గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ ।
నర్మదా సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు ॥

**నూతనముగా ఏదైనా కార్యము ప్రారంభించినపుడు**

వక్రతుండ మహాకాయ సూర్యకోటి సమప్రభ ।
నిర్విఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా ॥

**నిద్రించుటకు ముందు**

రామం స్కంధం హనూమంతం వైనతేయం వృకోదరం।
శయనే యఃస్మరేత్ నిత్యందుఃస్వప్నం తస్య నశ్యతి ॥

**అనారోగ్యానికి ఔషధం ప్రారంభించినపుడు**

ధన్వంతరిం గరుత్మంతం, ఫణిరాజం చ కౌస్తుభమ్ ।
అచ్యుతం చామృతం చంద్రం స్మరే దౌషధ కర్మణిః॥

**ప్రతినిత్యం భోజనం చేసేముందు**

అన్నపూర్ణే సదాపూర్ణే శంకర ప్రాణవల్లభే ।
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాందేహి చ పార్వతి ॥
మాతాచ పార్వతీదేవీ పితాదేవో మహేశ్వరః ।
బాంధవా శ్శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥

**భోజనం చేసిన తరువాత**

అగస్త్యం కుంభ కర్ణంచ శమంచ బడబానలం ।
ఆహార పరిణామార్థం స్మరామిచ వృకోదరమ్ ॥

**ఏదైనా ముఖ్యమైన కార్యంతలచి, బయలుదేరినపుడు**

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం॥

**శ్రీ మహా మృత్యుంజయ మంత్రం**

ఓం త్ర్యయంబకం యజామహే సుగంధిం పుష్టివర్దనం
ఉర్వారుక మివ బంధనాన్ మృత్యోర్ముక్షియమామృతాత్॥

**నూతన పుస్తకం ప్రారంభంలో (ఉచ్ఛారణకోసం)**

తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్,
నీవు నా యుల్లంబందున నిల్చి
జృంభణముగానుక్తుల్ సుశబ్దంబుల్ ।
శోభిల్లన్ బల్కుము నాదు వాక్కుననుసంప్రీతిన్‌జగన్మోహినీ,
పుల్లాబ్జాక్షి సరస్వతీ । భగవతీ । పూర్ణేందు బింబాననా॥

**జ్ఞానం, ధైర్యం, ధారణశక్తి, చైతన్యం, ఏకాగ్రత పెరుగుటకు చేయవలసిన శ్లోకాలు**

**శ్రీ గణపతి ప్రార్థన**

అగజానన పద్మార్కం । గజానన మహర్నిశమ్ ।
అనేకదం తం భక్తానాం । ఏకదంత ముపాస్మహే ॥

**శ్రీ ఆంజనేయ ప్రార్థన**

అంజనానందనం వీరం । జానకీ శోకనాశనం ॥
కపీశ మక్షహన్తారం । వందే లంకా భయంకరమ్ ॥

**శ్రీ సరస్వతీ ప్రార్థన**

సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మేసదా ।
పద్మపత్ర విశాలాక్షి పద్మకేసర వర్ణినీ ।
నిత్యం పద్మాలయా దేవీ । సామాం పాతు ।
సరస్వతీ భగవతీ భారతి నిశ్శేష జాడ్యాపహా ॥

**శ్రీరామ రక్షా స్తోత్రం**

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ । సీతాయాః పతయే నమః॥

**గురుపౌర్ణమినాడు, చదువు విషయమై పరీక్షల ముందు పఠించవలసినది**

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః ॥
అస్మత్ గురు చరణారవిందాభ్యాం నమోనమః

**దక్షిణామూర్తి ప్రార్థన**

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః॥

**హయగ్రీవ ప్రార్థన**

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

**మనలోని ప్రజ్ఞ పెరుగుటకు : ప్రజ్ఞా వివర్ధన స్తోత్రం**

యోగీశ్వరో మహాసేనః। కార్తికేయోగ్ని నందనః।
స్కందః కుమారః సేనానీః । స్వామీశంకర సంభవః॥
గాంగేయస్తామ్ర చూడశ్చ । బ్రహ్మచారీ శిఖిధ్వజః।
తారకారి రుమాపుత్రః। క్రౌంచారిశ్చ షడాననః॥
శబ్దబ్రహ్మ సముద్రశ్చ । సిద్ధసారస్వతో గుహః।
సనత్కుమారో భగవాన్ । భోగమోక్ష ఫలప్రదః॥
శరజన్మా గణాధీశ పూర్వజో ముక్తి మార్గకృత్ ।
సర్వాగమ ప్రణేతాచ । వాంఛితార్థ ప్రదర్శనః॥
అష్టావింశతి నామాని । మదీయానీతియః పఠేత్ ।
ప్రత్యూషే శ్రద్ధయాయుక్తో మూకోవాచస్పతి ర్భవేత్ ॥
మహామంత్ర మయానీతి । మమనామాను కీర్తనం ।
మహాప్రజ్ఞామవాప్నోతి । నాత్ర కార్యా విచారణా ॥

**అథ ద్వితీయ ప్రజ్ఞాకరం హయగ్రీవ స్తోత్రం**

ప్రాచీ సంధ్యా కాచి దంతర్నిశాయాః।
ప్రజ్ఞాదృష్టేరంజనీ శ్రీరపూర్వా ।
వక్త్రీవేదాన్ పాతుమేవాజివక్త్రా।
వాగీశాఖ్యా వాసుదేవస్య మూర్తిః।
ప్రణతాజ్ఞాన సందోహ । ధ్వాంతధ్వం సనకర్మఠమ్ ।
నమామి తురగగ్రీవం । హరిం సారస్వత ప్రదం ॥
శ్లోకద్వయమిదం ప్రాతర ష్టా వింశతి వారకం॥
ప్రయతః పఠతే నిత్యం కృత్స్నవిద్యా ప్రసిద్ధ్యతి ॥

**దత్తాత్రేయ ప్రార్థన**

కర్పూరకాంతి దేహాయ బ్రహ్మమూర్తి ధరాయ చ ।
వేదశాస్త్ర పరిజ్ఞాయ దత్తాత్రేయ నమోస్తుతే ।
శ్రీ దత్తశ్శరణం మమ ॥

**సర్వమంగళకరమైన పనులు ముందుచేయవలసినది లక్ష్మీ కటాక్షం కొరకు**

లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీం।
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురాం ॥
శ్రీమన్మందకటాక్షలబ్ధ విభవబ్రహ్మేంద్ర గంగాధరాం ।
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందేముకుందప్రియాం।
శుద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీ స్సరస్వతీంశ్రీర్లక్ష్మీ వరలక్ష్మీశ్చ।
ప్రసన్నా మమ సర్వదా వరాంకుశౌపాశ మభీతి ముద్రాం
కరైర్వహంతీం కమలాసనస్థాం॥ బాలార్క కోటి ప్రతిభాం
త్రినేత్రాం। భజేహమంబాంజగదీశ్వరీంతామ్॥
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే ।
త్ర్యంబకే దేవీ నారాయణ నమోస్తుతే ॥

**విష్ణు ధ్యానం**

శాన్తాకారం భుజంగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం ॥
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యానగమ్యం।
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్ ॥

**శివ స్తోత్రమ్**

శంకర స్సర్వదాపాతు । శంభుః పాతు సదాహరః ।
ఉమాపతి స్సదాపాతు । మాంపాతు భువనేశ్వరః ॥

**ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమ్**

సౌరాష్ట్రే సోమనాధం చ శ్రీశైలే మల్లిఖార్జునమ్ ।
ఉజ్జయిన్యాం మహాకాళ మోంకార మమలేశ్వరమ్ ।
ప్రజ్వల్యాం వైద్యనాథంచ ఢాకిన్యాం భీమశంకరమ్ ।
సేతు బంధేతు రామేశం । త్ర్యంబకం గౌతమీతటే ।
హిమాలయేతు కేదారం । ఘృష్ణేచ శివాలయే ॥
ఏతాని జ్యోతిర్లింగాని సాయంప్రాతః పఠేన్నరః।
సప్తజన్మ కృతం పాపం । స్మరణేన వినశ్యతి ॥

**శ్రీ గాయిత్రీ మహా మంత్ర వైభవం**

ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయై ర్ముఖైస్త్ర్యక్షణైః ।
యుక్తా మిన్దు నిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థ వర్ణాత్మికాం॥
గాయిత్రీం వరదాభయాంకుశ కశా శ్శుభ్రం కపాలంగదాం।
శంఖం చక్రమథారవిన్దయుగళం హస్తైర్వహంతీంభజే॥

**దీప దర్శనం చేస్తున్నప్పుడు**

ఘృతవర్తి సమాయుక్తం అంధకార వినాశకం ।
దీపం దాస్యామి దేవేశ గృహాణ ముదితోభవ ॥

**ధూపానికి (అగరవత్తులు మొ॥వాటికి)**

దశాంగం గుగ్గులోపేతం సుగంధంచ మనోహరం
ధూపందాస్యామి దేవేశ గృహణముదితోభవ।

**శ్రీ సూర్య స్తోత్రమ్**

తేజోరాశిం శ్రియాయుక్తం తప్త కాంచన సన్నిభం ।
కిరీటినం పద్మనేత్రం పద్మరాగవిభూషితం ॥
పద్మాసనం పద్మకరం పద్మగర్భ సమద్యుతిమ్ ।
సప్తాశ్వరథ మారూఢం ద్విభుజం వరదం రవిమ్ ॥

1 ఓం మిత్రాయ నమః 2 ఓం రవయే నమః 3 ఓం సూర్యాయ నమః 4 ఓం భానవే నమః 5 ఓం ఖగాయ నమః 6 ఓం పూష్ణే నమః 7 ఓం హిరణ్యగర్భాయ నమః 8 ఓం మరీచయే నమః 9 ఓం ఆదిత్యాయ నమః 10 ఓం సవిత్రే నమః 11 ఓం ఆర్కాయనమః 12 ఓం భాస్కరాయ నమః

మిత్ర రవి సూర్యభాను ఖగపూష హిరణ్యగర్భ
మరీచ్యాదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః ॥
వినతా తనయో దేవః కర్మసాక్షీ సురేశ్వరః।
సప్తాశ్వః సప్తరజ్జుశ్చ అరుణోమేప్రసీదతు ॥
ఓం అర్కసాక్షిణే అరుణాయ నమః

**నవగ్రహ సంబంధమైన, వివిధ దోష నివారణ స్తోత్రములు సమర్పించవలసిన దానములు అలంకరించుకొనవలసిన రాళ్ళు**

**1. రవి :** రోగ బాధ విముక్తికి
నిత్యమూ ఉదయం మరియు ముఖ్యముగా ఆదివారము నాడు పలుమార్లు ఈ స్తోత్రము చేయవలెను.

ద్విభుజం పద్మహస్తం చ వరదం మకుటాన్వితం ।
ధ్యాయే ద్దివాకరం దేవం సర్వాభీష్ట ఫలప్రదమ్ ॥

రవి దోష నివారణకు : గోధుమలు దానము, కెంపు రాయిని ధరించుట మంచిది.

**2. చంద్ర :** దేహారోగ్యమునకు, ధనలాభమునకు

గంగాధరం దేవసమం శ్వేతవర్ణం నిశాకరమ్ ।
ధ్యాయే దమృత సంభూతమ్ సర్వకామ ఫలప్రదం ॥

చంద్రదోష నివారణకు బియ్యం దానము. మంచి ముత్యం ధరించడం మంచిది.

**3. కుజ :** ఋణబాధలు తీరుటకు
రక్తమాల్యాంబర ధరం హేమరూపం చతుర్భుజం ।
శక్తి శూలగదాపద్మం ధారయంతం కరాంబుజే ॥
(ఋణవిమోచనకు ప్రత్యేకం కుజనామ స్తోత్రం చేయవలెను.)
రక్త మాలాంబరధరః శూలశక్తి గదాధరః ।
చతుర్భుజః మేషగతః । వరదః॥ మంగళః ఋణహరః
ధనప్రదః లోహితః యమః రోగాపహారకః॥
సర్వదేవ పూజితః అంగారకః । మహీపుత్రః భగవాన్॥
కుజదోషమునకు కందులుదానం, పగడం ధరించాలి.

**4. బుధ :** మనోరధసిద్ధి, బంధుమిత్రుల, వ్యాపారాలకు
సింహారూఢం చతుర్భుజం ఖడ్గచర్మగదాధరం ।
సోమపుత్రం మహాసౌమ్యం ధ్యాయేత్సర్వార్థ సిద్ధిదం ॥
బుధ దోషములకు పెసలుదానం, మరకతం ధారణమంచిది.

**5. గురు :** శుభకార్యములు ఫలించుటకు, సంతానంకొరకు
వరాక్షమాల దండంచ కమండలధరం విభుం ।
పుష్యరాగాంకితం పీతం వరదం భావయేద్గురుం ॥
గురుగ్రహదోషమునకు శనగలుదానం,పుష్యరాగం ధరించుట

**6. శుక్ర :** సుఖదాంపత్యమునకు, ఆయురారోగ్యములకు
జటిలం సాక్షసూత్రంచ వరదండ కమండలం ।
శ్వేత వస్త్రావృతం శుక్రం ధ్యాయేద్దానవ పూజితం ॥
శుక్ర దోషనివారణకు బొబ్బర్ల దానం, వజ్రం ధారణమంచిది.

**7. శని :** కార్యసిద్ధికి గ్రహబలం చేకూర్చుటకు
నీలాంబరో నీలవపుః కిరీటీ గృధ్రస్థితశ్చాపకరో ధనుష్మాన్।
చతుర్భుజః స్సూర్యసుతః ప్రశాంతః
సచాస్తు మహ్యాంవరదః ప్రసన్నః॥
శని ప్రీత్యర్థం మరియొక ప్రత్యేక ప్రార్ధన :
నమస్తే । కోణ సంస్థాయ । పింగళాయ । నమోస్తుతే ।
నమస్తే । బభ్రురూపాయ । కృష్ణాయచ । నమోస్తుతే ।
నమస్తే రౌద్రవేషాయ । నమస్తే శాంతి దాయచ । ప్రసీద
మమదేవేశ దీనస్య ప్రణతస్యచ ॥
శనిదోష నివారాణార్థం నువ్వుల దానము, నీలమణిధారణ.

**8. రాహువు :** దారిద్ర్యబాధా నివారణకు, అదృష్టభాగ్యమునకు
కరాళవదనం ఖడ్గచర్మశూల వరాన్వితం ।
నీలసింహాసనస్థం చ ధ్యాయే ద్రాహుం ప్రశాంతయే ।
రాహు దోషమునకు మినుములదానం, గోమేధికం ధారణ.

**9. కేతువు :** చోరులు, అగ్నిప్రమాదములు, పైశాచిక బాధల నివారణకు
ధూమ్రవర్ణం ద్విబాహుంచ కేతుం తు వికృతాననం ।
గృధ్రాసనగతం నిత్యం ధ్యాయేత్సర్వ ఫలాప్తయే॥
కేతుగ్రహ దోషమునకు ఉలవలు దానం, వైఢూర్య ధారణ.
(జాతకములయందు గల విశేష దోషాలకు ప్రత్యేక జపాలు, శాంతులు చేయించుకొనవలెను.)

## హేమలంబనామ సంవత్సర ఫలం

**నవనాయకుల నిర్ణయము :** 1. రాజు-బుధుడు 2. మంత్రి-చంద్రుడు 3. సైన్యాధిపతి- శని 4. సస్యాధిపతి-గురుడు 5. ధాన్యాధిపతి-కుజుడు 6. అర్ఘ్యాధిపతి-రవి 7. మేఘాధిపతి- రవి 8. రసాధిపతి - శని 9. నీరసాధిపతి - గురుడు.

**గురుమూఢమి :** ఆశ్వయుజ బ. షష్ఠీ బుధవారం (11-10-2017) నాడు గురుమూఢమి ప్రారంభము. కార్తిక బ. సప్తమి శుక్రవారం (10-11-2017) నాడు పూర్తగును.

**శుక్ర మూఢమి :** మార్గశిర శు. చతుర్దశి శనివారం (2-12-2017) నాడు శుక్రమూఢమి ప్రారంభమగును. మాఘ బ. అమావాస్య (15-02-2018) నాడు పూర్తగును.

**కావేరీ పుష్కరములు :** శ్రీ హేమలంబ నామ సం॥ర భాద్రపద శు.పంచమి శనివారం రాత్రి గం. 4-19 ని.లకు గురుడు తులారాశిలో ప్రవేశించుటచే తేది 27-08-2017 ఆదివారం నుండి కావేరీనది పుష్కరములు 12 రోజుల వరకు అనగా 07-09-2017 నాడు పూర్తగును.

**కర్తరి ప్రవేశము :** 4-5-2017న డొల్లుకర్తరీ ప్రారంభమయి, 8-5-2017 నుండి నిజకర్తరీ ప్రారంభమగును. 21-5-2017కి కర్తరి పూర్తగును. ఈ సమయమునందు నూతన నిర్మాణములు చేస్తున్న (కర్ర,రాయి,మట్టి)పనులు నిలుపుదల చేయుట మంచిది.

## దేశారిష్ట యోగములు :

సంవత్సరారంభము నుండి శని ధనుస్సు వక్రములో నుండి 26-8-2017న వక్రత్యాగమయ్యెను. 26-8-2017 నుండి 30-1-2018 వరకు గురు శనులకు త్రిలాభ స్థితి వలన వింధ్యపర్వతము నుండి లంకానగరము వరకు గల ప్రాంతము ప్రజల ఎక్కువగా మరణింతురు. 31-01-2018 నుండి సంవత్సరాంతము వరకు గురు-శనులకు దిర్ద్వాదశ స్థితి కలిగి వున్నవి. గురుడు సంవత్సరారంభం నుండి కన్యనందు వక్రించి 8-6-2017న వక్ర త్యాగమగును. మరల 8-2-2018న వృశ్చికములో గురుడు వక్రారంభమయి సంవత్సరాంతమయ్యెను. గురుడు అతిచారముచే మూడు రాశులు సంచరించుట వలన ధరలునియంత్రణలో లేకుండుట జరుగును. శని ధనస్సునందు సంవత్సరాంతము వరకు ఉండుట వలన యుద్ధభయము, కరువు ఉండును. గురుడు అతిచారములో నుండి శని వక్రించియున్నచో ప్రపంచమంతయు హాహాకారములు చేయును. దక్షిణ దేశమునకు దుర్భిక్షము. 12-1-2018 నుండి 28-2-2018 వరకు కుజ-శనులకు ద్విర్ద్వాదశ స్థితివలన యుద్ధభయములుం డును.

సంవత్సరారంభం నుండి 26-8-17 వరకు శని ధనస్సు నందు వక్రించి ఉండును. మార్చిలో శని కుజులు కలసి ఉండుట వలన మానవులకు, గోవులకు, గుఱ్ఱములకు, ఏనుగులకు హాని కలిగి 3 వంతులు నశింతురు. ధనుస్సు నందు శని ఉండుటవలన ఉత్తరప్రదేశ్, బెంగాల్, ఒరిస్సా, కాశ్మీర్, గుజరాత్ ప్రాంతములలో అశుభము కల్గును. 9-10-2017 నుండి 10-01-2018 వరకు కాలసర్పయోగము వలన పంటలు నాశనమగును. జూలై, ఆగస్టు, అక్టోబర్‌లలో కర్నాటక, సింహ, కన్యలలో నాల్గు గ్రహములుండుట వలన గాలులతో కూడిన వర్షములతో పీడలుకల్గును.

**1. ఆదాయ వ్యయములు**

| రాశులు | ఆదాయము | వ్యయము |
|---|---|---|
| మేష-వృశ్చికములు | 05 | 05 |
| వృషభ- తులలు | 14 | 11 |
| మిధున-కన్యలు | 02 | 11 |
| కర్కటకము | 11 | 08 |
| సింహము | 14 | 02 |
| ధనుర్మీనములు | 08 | 11 |
| మకర కుంభములు | 11 | 05 |

సర్వాదాయం- 65; సర్వ వ్యయం-53

**2. రాజ పూజ్యావమానములు**

| రాశి | రా-అ | రాశి | రా-అ |
|---|---|---|---|
| మేషం | 3-1 | తుల | 7-7 |
| వృషభం | 6-1 | వృశ్చికం | 3-3 |
| మిధునం | 2-4 | ధనుస్సు | 6-3 |
| కర్కటకం | 5-4 | మకరం | 2-6 |
| సింహం | 1-7 | కుంభం | 5-6 |
| కన్య | 4-7 | మీనం | 1-2 |

**3. కందాయ ఫలములు**

| అశ్వి | భరణి | కృత్తిక | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 0 0 | 7 1 2 | 2 2 4 | 5 0 1 | 0 1 3 | 3 2 0 | 6 0 2 | 1 1 4 | 4 2 1 |
| మఖ | పూఫ | ఉఫ | హస్త | చిత్ర | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ |
| 7 0 3 | 2 1 0 | 5 2 2 | 0 0 4 | 3 1 1 | 6 2 3 | 1 0 0 | 4 1 2 | 7 2 4 |
| మూల | పూషా | ఉషా | శ్రవ | ధని | శత | పూభా | ఉభా | రేవతి |
| 2 0 1 | 5 1 3 | 0 2 0 | 3 0 2 | 6 1 4 | 1 2 1 | 4 0 3 | 7 1 0 | 2 2 2 |

**4. సంవత్సర ఫలము**

| | | | | |
|---|---|---|---|---|
| అశ్విని | పుష్యమి | స్వాతి | అభిజిత్తులకు | యుద్ధభయం |
| భరణి | ఆశ్రేష | విశాఖ | శ్రవణములకు | అలంకారప్రాప్తి |
| కృత్తిక | మఘ | అనురాధ | ధనిష్ఠలకు | రోగభయం |
| రోహిణి | పూ.ఫ | జ్యేష్ఠ | శతతారలకు | ఆయుర్వృద్ధి |
| మృగశిర | ఉత్తర | మూల | పూర్వభాద్రలకు | ధనలాభం |
| ఆర్ద్ర | హస్త | పూషా | ఉత్తరాభాద్రలకు | మనస్తాపం |
| పునర్వసు | చిత్ర | ఉషా | రేవతులకు | రాజపూజ్యం |

# శ్రీ హేమలంబ నామ సంవత్సరములో ముఖ్య పండుగలు

## (29-03-2017 నుండి 17-03-2018)

**2017 - చైత్రమాసము**

29 తెలుగు సంవత్సరాది, ప్రపాదానమ్,
వసంత నవరాత్రారంభం,చంద్రదర్శనం
30 సౌభాగ్య గౌరీవ్రతం, గణేశపూజ
31 శుక్రమూఢమి పూర్తి

**ఏప్రిల్ 2017**

1 శ్రీపంచమి, నాగపంచమి
5 శ్రీరామనవమి
6 ధర్మరాజ దశమి
7 మతత్రయైకాదశీ
8 వామన ద్వాదశీ
10 మేషసంక్రమణం
11 చైత్రపూర్ణిమ
16 మత్స్య జయంతి
22 మతత్రయైకాదశీ
24 వరాహజయన్తీ
25 మాసశివరాత్రి
26 సర్వేషామమవాస్య

**వైశాఖమాసము**

27 చంద్రదర్శనం
29 అక్షయ తృతీయ, బలరామజయన్తి
నాగచతుర్థీ

**మే 2017**

3 అపరాజితాదేవి పూజ
6 మతత్రయైకాదశీ
7 పరశురామద్వాదశీ
9 నృసింహజయన్తీ
10 వైశాఖపూర్ణిమ, సంపద్గౌరీవ్రతం
11 వృషభ సంక్రమణం
21 హనుమజ్జయంతి,నిజకర్తరి
22 మతత్రయైకాదశీ
24 మాసశివరాత్రి
25 సర్వేషామమావాస్య

**జ్యేష్ఠమాసము**

**మే27** చంద్రదర్శనమ్
29 అగస్త్యాస్తమయం

**జూన్ 2017**

4 దశపాపహర దశమీ,
సేతుబంధనరామేశ్వర ప్రతిష్ఠా
5 నిర్జలైకాదశి, మతత్రయైకాదశీ
9 జ్యేష్ఠపూర్ణిమ, సావిత్రీవ్రతం,
వృషభపూజ, ఏరువాక పూర్ణిమ
12 మిథున సంక్రమణం
20 మతత్రయైకాదశీ
21 కూర్మజయన్తీ
22 మాసశివరాత్రి
23 సర్వేషామమావాస్య

**ఆషాఢమాసము**

25 చంద్రదర్శనమ్,
పూరీజగన్నాథ రథోత్సవము
28 స్కంద పంచమి
29 కుమారషష్ఠి

**జూలై 2017**

4 శయనైకాదశీ, తొలిఏకాదశి,మతత్రయైకాదశీ
5 చాతుర్మాస్య వ్రత ప్రారంభం
9 గురుపూర్ణిమ, వ్యాసపూజ
13 కర్కాటక సంక్రమణం,
దక్షిణాయనం ప్రారంభం
19 స్మార్తైకాదశీ
21 మాసశివరాత్రి

**శ్రావణమాసము**

24 చంద్రదర్శనం
26 దూర్వాగణపతి వ్రతం
27 నాగపూజ
28 నాగపంచమి, సామవేదులకు ఉపాకర్మ

**ఆగస్టు 2017**

3 మతత్రయైకాదశీ
4 వరలక్ష్మీ వ్రతం
7 శ్రావణపూర్ణిమ, చంద్రగ్రహణం
11 సంకటహర చతుర్థీ
13 సింహసంక్రమణం
14 శ్రీకృష్ణజన్మాష్టమీ
17 స్మార్తైకాదశీ
19 శనిత్రయోదశి
20 మాసశివరాత్రి
21 సర్వేషామమావాస్య

**భాద్రపదమాసం**

22 అగస్త్యోదయం
23 చంద్రదర్శనం
24 షోడశోమావ్రతం (16కుడుములతద్ది)
25 వినాయకచవితి
26 ఋషిపంచమి
27 సూర్యషష్ఠి, బౌద్ధజయంతి
30 కేదారవ్రతం

**సెప్టెంబరు 2017**

2 మతత్రయైకాదశీ
3 వామనజయంతి
5 అనంతపద్మనాభ చతుర్దశి
6 పూర్ణిమ
7 మహాలయ పక్షప్రారంభం
14 కన్యాసంక్రమణం
16 మతత్రయైకాదశీ
18 మాసశివరాత్రి
19 సర్వేషామమావాస్య

**ఆశ్వయుజమాసం**

20 చంద్రదర్శనం, దేవీశరన్నవరాత్ర ప్రా.
27 దేవీత్రిరాత్రవ్రం, సరస్వతీపూజ
28 దుర్గాష్టమీ
29 మహానవమి
30 విజయదశమి, శమీపూజ

**అక్టోబరు 2017**

1 మతత్రయైకాదశీ
5 పూర్ణిమ, ఆగ్రయణం
7 అట్లతద్దె
14 తులాసంక్రమణం
15 మతత్రయైకాదశీ
17 నరకచతుర్దశీ
18 మాసశివరాత్రి
19 దీపావళి,సర్వేషామమావాస్య

**కార్తికమాసం**

**అక్టోబరు 2017**

20 ఆకాశదీపాప్రారంభం,
అఖండదీపప్రారంభం
21 చంద్రదర్శనం, భగినిహస్త భోజనం
23 నాగులచవితి
25 నాగపంచమి
31 బోధనైకాదశీ,మతత్రయైకాదశీ

**నవంబరు-2017**

1 చిల్కుద్వాదశి, క్షీరాబ్ధిద్వాదశి
2 శనిత్రయోదశి
3 జ్వాలాతోరణం
4 పూర్ణిమ, మహాకార్తీకి
13 వృశ్చిక సంక్రమణం
14 మతత్రయైకాదశీ
16 మాసశివరాత్రి
18 సర్వేషామమావాస్య

**మార్గశీర్షమాసం**

19 పోలేరమ్మ స్వర్గం
20 చంద్రదర్శనం
24 సుబ్రహ్మణ్యషష్ఠి
26 కాలభైరవాష్టమీ
30. మతత్రయైకాదశీ

**డిశంబరు-2017**

1 హనుమద్వ్రతం
2 దత్తాత్రేయోత్పత్తి, దత్తజయంతి
3 పూర్ణిమ
5 పరశురామ జయన్తీ
12 ధనుస్సంక్రమణం, ధనుర్మాసప్రారంభం
13 మతత్రయైకాదశీ
16 శనిత్రయోదశి, మాసశివరాత్రి
17 సర్వేషామమావాస్య

**పౌషమాసం**

19 చంద్రదర్శనం

29 మత్రయైకాదశీ
**జనవరి-2018**
2 పూర్ణిమ
10 భోగి
11 మకరసంక్రమణం,సంక్రాంతి, ఉత్తరాయన పుణ్యకాల ప్రారంభం
12 కనుమ, మత్రయ 11శీ
13 ముక్కనుమ
14 మాసశివరాత్రి
15 సర్వేషామమావాస్య

**మాఘమాసం**

18 చంద్రదర్శనం
21 శ్రీపంచమి, మదనపంచమి
24 రథసప్తమి, సూర్యజయంతి
27 భీష్మైకాదశీ, స్మార్తైకాదశీ
31 మహామాఘి, పౌర్ణమి
**ఫిబ్రవరి - 2018**
9 కుంభసంక్రమణం
11 మత్రయైకాదశీ
14 మహాశివరాత్రి, మాసశివరాత్రి
15 సర్వేషామమావాస్య,శుక్రమూఢమిపూర్తి

**ఫాల్గునమాసం**

17 చంద్రదర్శనం
26 మత్రయైకాదశీ
**మార్చి-2018**
1 హోళికాపూర్ణిమ, హోళీపండుగ
11 మీన సంక్రమణం
13 మత్రయైకాదశీ
16 మాసశివరాత్రి
17 సర్వేషామమావాస్య
18 శ్రీ విళంబ నామ సంవత్సరాది (నూతన సంవత్సరాది)

**గుర్వారాధన దినములు**

**(ఏతాని అపరాహ్ణవ్యాపినీ గ్రాహ్యాని)**

**2017-మే5** శ్రీ శంకర జయంతి (వై.శు.10.
జూన్ 5 శంకర భగవత్పాదాచార్యాణాం కైలాసగమనం (జ్యే॥శు॥ 12శీ)
6 శ్రీవిద్యారణ్య స్వామి నామారాధనం (జ్యే॥శు॥13శీ)
అక్టోబరు 26
శ్రీ జగద్గురు శ్రీవిద్యాశంకర తీర్థ స్వామినాం లంబికాయోగప్రవేశః(కా.శు.7మీ)
మార్చి 7 శ్రీమదభినవ సచ్చిదానందభారతీస్వామి నామారాధనం (ఫా.బ. 6)

**మధ్వ పుణ్యదినములు (అపరాహ్ణవ్యాపినీ)**

29 చైత్రశు.2 సత్యప్రజ్ఞతీర్థపుణ్యతిథి వేదవ్యాసతీ.పు.
ఏప్రియల్
3 చై.శు. 8 శ్రీ సత్యధ్యాన తీ॥పు॥
4 చై.శు. 9 శ్రీ కవీంద్ర తీ॥పు॥
8 చై.శు. 13 శ్రీ సత్యప్రియ తీ॥పు॥
15 చై.బ. 4 శ్రీ వాగీశ తీ॥పు॥
21 చై.బ. 10 శ్రీ సత్యవిజయ తీ॥పు॥
27 వై.శు. 1 శ్రీ సత్యానంద తీ॥పు॥
28 వై.శు. 3 శ్రీ విద్యాధిరాజ తీ॥పు॥
మే1 వై.శు. 6 శ్రీ రామచంద్ర తీ॥పు॥
28 జ్యే.శు. 3 శ్రీసత్యసంధా తీ॥పు॥
జూన్9జ్యే.శు. 15 శ్రీపాదరాజ తీ॥పు॥
శ్రీసత్యభినవ తీ॥పు॥
10 జ్యే.బ. 1 శ్రీకృష్ణద్వైపాయన తీ॥పు॥
11 జ్యే.బ. 2 శ్రీసత్యపూర్ణ తీ॥పు॥
12 జ్యే.బ. 3 శ్రీరఘువర్య తీ॥పు॥
18 జ్యే.బ. 9 శ్రీసత్యధీర తీ॥పు॥
20 జ్యే.బ. 11 శ్రీ విద్యాపతి తీ॥పు॥
22 జ్యే.బ. 13 శ్రీవిజయీంద్ర తీ॥పు॥
జూలై2ఆ.శు. 9 శ్రీ సత్యాధిరాజ తీ॥పు॥
8 ఆషా.శు 15శ్రీసత్యసంకల్ప తీ॥పు॥
14 ఆషా.బ. 6 శ్రీజయతీర్థ తీ॥పు॥
23 ఆషా. 30 శ్రీసత్యాధీశ తీ॥పు॥
29 శ్రా.శు 7 శ్రీసత్యవర తీ॥పు॥
ఆగ9 శ్రా.బ.2 శ్రీరాఘవేంద్ర తీ॥పు॥
19 శ్రా.బ 13 శ్రీసత్యధర్మ తీ॥పు॥
సెప్టె.2 భా.శు.11 శ్రీసత్యేష్ట తీ॥పు॥
8 భా.బ. 2 శ్రీశ్రీనివాస తీ॥పు॥
21 ఆశ్వ.శు.1 శ్రీమాధవ తీ॥పు॥
27 ఆ.శు.7 శ్రీసత్యపరాయణ తీ॥పు॥
28 ఆ.శు.8 శ్రీసత్యపరాక్రమ తీ॥పు॥
అక్టో1ఆశ్వ.శు11 శ్రీవిష్ణు తీ॥పు॥
22 కా.శు.3 శ్రీసత్యప్రమోద తీ॥పు॥
31 కా.శు.11 శ్రీవేదనిధి తీ॥పు॥
నవ7 కా.బ. 4 శ్రీవిద్యానిధి తీ॥పు॥
18 కా.బ.30 శ్రీపద్మనాభ తీ॥పు॥
21 మా.శు.3 శ్రీరఘువీర తీ॥పు॥
28 మా.శు10 శ్రీసత్యనిధి తీ॥పు॥
29 మా.శు.11 శ్రీసత్యనాథ తీ॥పు॥
డిశ 7 మా.బ 5 శ్రీ అక్షోభ్య తీ॥పు॥
29 పుష్యశు.11 శ్రీరఘోత్తమ తీ॥పు॥
**2018 జనవరి**
6 పు.బ. 5 శ్రీసత్యకామ తీ॥పు॥
9 పు.బ. 8 శ్రీసత్యాభిజ్ఞ తీ॥పు॥
16 పు.బ.30 శ్రీవిద్యాధీశ
శ్రీపురందరదాస తీ॥పు॥
25 మా.శు.9 శ్రీమధ్వాచార్య బదరికాశ్రమప్ర.; శ్రీరామానందతీ॥పు॥
27 మా.శు.11 శ్రీసత్యజ్ఞాన తీ॥పు॥
ఫిబ్రవరి
22 ఫాల్గు.శు 7 శ్రీసత్యజ్ఞాన తీ॥పు॥
మార్చి2 ఫా.బ.1 శ్రీసత్యబోధ తీ॥పు॥
3 ఫా.బ. 2 శ్రీవాదిరాజ తీ॥పు॥
5 ఫా.బ. 4 శ్రీరతివ్యాసరాజ తీ॥పు॥
17 ఫా.బ.30 శ్రీసత్యసంతుష్ట తీ॥పు॥

**వైష్ణవ తిరునక్షత్రములు**

గమనిక:పూర్వాచార్యాణాం జన్మనక్షత్రం కలామాత్రేణ సంగవ స్పర్శి గ్రాహ్యమ్।

**మీనమాసం**

2017 మార్చి
30 భర భూతోత్తాత్రిశిరియ తి.న

**మేషమాసం**

ఏప్రిల్
25 రేవ పెరియ పెరుమాళ్ తి.న
26 అశ్వి వడుగనంబిత్రాదికలియన్‌స్వామి తి.న
28 కృత్తి ఉయ్యక్కొండార్ తి.న
30 ఆర్ద్ర ఉడయవర్ తి.న
మే 1 పున చక్రవర్తి తిరుమగనార్‌తి.న
7 హస్త తేవప్పెరుమాళ్ తి.న

**వృషభమాసం**

జూన్6 స్వాతి అళహసింగర్ పెరియర్ తి.న
2 విశా నమ్మాళ్వార్ తిరువాయ్‌మెడిప్పిళ్ళైతి.న
8 అనూ పెరియభటర్ శ్రీరామపిళ్ళై తి.న

**మిధునమాసం**

జూన్12 ఉ.షాఢ యాళందార్ తి.న
26 పుష్య మర్నార్ నంబి తి.న
జూలై 1 హస బదరీనారాయణప్పెరుమాళ్ తి.న
5 అనూ శ్రీమన్నాథముని తి.న

**కర్కాటక మాసం**

23 పుష్య ప్రతివాద భయంకరభయంకరపెరియణ్ణన్ తి.న
26 పూ.ఫ ఆండాళ్‌యదుగినాచ్చియార్‌కందాళె తి.న

**సింహమాసం**

16 రోహి పెరియవాచ్చాంబిళ్ళై తి.న
17 మృగ పరవస్తు పట్టరభిరాన్ తి.న
25 హస్త బదరీనారాయణప్పెరుమాళ్ తి.న

**కన్యామాసం**

అక్టో 1 శ్రవ తిరువేంగడముడయాన్ తి.న

**తులామాసం**

25 మూల మనవాళమామునిగళ్ తి.న
26 పూ.షా శేవముదలియాళ్వార్ తి.న
28 శ్రవ పొయ్‌గైళ్వార్ తి.న
29 ధని పూదత్తాళ్వార్ తి.న
30 శత పేయాళ్వార్ తి.న

**వృశ్చికమాసం**

డిశ 1భర అరుణాళప్పెరుమాళెం తి.న
2 కృత్తి తిరుమంగైయాళ్వార్ తి.న
3 రోహి తిరుప్పాణియాళ్వార్ తి.న
5 ఆర్ద్ర కూరత్తాళ్వార్ తి.న

**ధనుర్మాసం**

17 జ్యేష్ఠ తొండరడిప్పొడియాళ్వార్ తి.న

**మకరమాసం**

2018ఫిబ్రవరి 2 మఖ తిరుమడిశెయాళ్వార్ తి.న
5 హస్త కూరత్తాళ్వార్ తి.న

**కుంభమాసం**

26 పున కులశేఖరాళ్వార్ తి.న

**శ్రీ గురుభ్యోనమః।** అథాస్మిన్ దేశేలోకవ్యవహారార్థం చాంద్ర మానాబ్దోగ్రాహ్యః।। వింధ్యస్యఉత్తరదేశేషు బార్హస్పత్య మానాబ్దో గ్రాహ్యః। చాంద్రమాన వశాదయం **'హేమలంబ'** నామ సంవత్సరః బార్హస్పత్య మానవశాదయం **'సాధారణ'** నామ సంవత్సరః। గురూదయాబ్ద వశాత్ **చైత్రాబ్దోగ్రాహ్యః।** అత్ర ప్రభవాది షష్టి సంవత్సరేషు పంచవత్సరాత్మ కాని ద్వాదశయుగానిసంతి। తదుక్తం శ్రీపతినా। యుగంభవేత్ వత్సర పంచకేన। యుగానితు ద్వాదశవర్ష షష్ట్యా। మిత్యేతేషాం ద్వాదశ యుగానాం మధ్యే అహిర్బుధ్న్య దేవతాకం షష్ఠం యుగం ప్రవర్త మానమ్ । పంచ సంవత్సరాత్మకే యుగే సంవత్సర పరివత్సరే దావత్స రాను వత్సరేద్వత్స రాణాం మధ్యే **'అగ్ని'** దేవతాక **సంవత్సర** నామక **'హేమలంబ'** నామ సంవత్సరః। అథాస్మిన్ వర్షే **"సంవత్సరేషుదాతౄణాం తిలదానం మహాఫలం"** ఇత్యుక్త త్వాత్ **'తిలదానమ్'** దానం కర్తవ్యమ్। (ఈసం।।ములో నువ్వులు దానము చేయవలయును.)

అస్య సమస్తకల్యాణభాజనస్య శ్రౌతస్మార్తాది నిత్యకర్మానుష్ఠాన క్రియాతంత్రవ్యవహార హేతుభూతస్య **"శ్రీ హేమలంబ"**నామ సంవత్సరస్య సాంగో పాంగంవత్సరస్య బ్రహ్మణో జన్మనః ఫలం।। యేశ్రుణ్వంతిక్రతు ఫలం ప్రాప్నువంతి న సంశయ ఇత్యుక్తత్వాత్ బ్రహ్మేయుః ప్రమాణ మన్వింద్ర సప్తమాన ప్రమాణ వర్ష వర్షాది తత్తద్గ్రహచార గ్రహణ గ్రహోదయాస్త వక్ర వక్రత్యాగాది యధాకాల సంభవలక్ష్మీ నారాయ ణాద్యలభ్యపుణ్యయాగకాల సహితం సాంగోపాంగం పంచాంగం దృక్సి మం క్రియతే ।

తత్రాదౌ బ్రహ్మేయుః ప్రమాణమ్ ।। తీక్ష్ణసూచ్యాబ్జ పుష్పస్యదళ వేధస్తృటిర్భవేత్" దిత్యాదినా కాలనియమోస్తి బ్రహ్మణః పరమేష్ఠిన "ఇత్యంత బ్రహ్మసిద్ధాంతవాక్యానుసారేణ సౌరమానేన బ్రహ్మణః

1. తృటికాలప్రమాణంమాసములు5 దినములు27ఘ।।46 విఘ।।40
2. లవకాలప్ర।। సం।।లు 49 మా।।4 ది।।17 ఘ।।46 వి।।40
3. నిమేషకాలప్ర।। సం।। 1481 మా।।5 ది।।23 ఘ।।20
4. గుర్వక్షరోచ్చారణ కాల ప్ర।। సం।।40 వేలు
5. ప్రాణకాల ప్ర।। సం।।4లక్షలు
6. విఘటికాప్రమాణ సం।।24ల।।
7. ఘటికాప్ర।। సం।। 14 కో।। 40ల।।సం।।
8. పగటి ప్ర।।సౌరాబ్దములు సం।।432కోట్లు
9. అహోరాత్ర ప్ర।। సం।। 864కో।।
10. మాసప్ర।। సౌరాబ్దములు సం।। 25,920కో।।
11. ఋతుప్ర।। సౌరాబ్దములు సం।। 51,840కో।।
12. ఆయన ప్ర।।సౌరాబ్దములు సం।। 1,55,520కో।।
13. ప్రమాణ సౌరాబ్దములు సం।। 3,11,040కో।।
14. బ్రహ్మణః స్వమా నేన ఆయుర్వర్షశతమేవ, ఆయుః ప్ర।।సౌరాబ్దములు సం।। 3,11,04,000కో।।

వర్తమాన స్యాస్యబ్రహ్మణఃపరాఖ్యస్య ఆయుషోర్ధంగతం।। ద్వితీయపరార్ధే ప్రథమవర్షే ప్రథమవాసరే స్వమానేన త్రయోదశ ఘటికాః।। 42,ద్విచత్వాదింశద్విఘటికాః।।ప్రాణకాలాః।।గుర్వక్ష రోచ్చారణకాల13,నిమేషకాలాః19,లవకాలా10, **తృటికాలా 60. సంప్రతి 61 తృటికాలే గతసౌరమాసాదయః మా।। 2-00-47-00విఘ।। ఏష్యమాసాదయఃమా।।3-26-59-40 విఘటికాః** ఏష్యమాసాదయఃమా।।3 ది।।19ఘ।।13 వి।।0విఘటికాః।।, సౌరమానేనబ్రహ్మణోవయోగతవత్సరాః15,52,197కో।। 29ల।। 49వే।।112సం।।రాలు.

వర్తమానశ్వేతవరాహకల్పమందు స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుషములు అనుపేర్లుగల ఆరు మన్మంతర ములు గతించినవి. వర్తమానమగు 7వదగు వైవస్వత మన్వంతర ములో 27మహాయుగములు గతించినవి. 28వ మహాయుగము నడుచు చున్నది. మనువు,ఇంద్రుడు,సప్తఋషులకు కూడా వారి మానముచేత నూరుసం।।ములు ఆయుర్దాయము. అట్టి ఆయుర్దాయము సౌరమాన ముచేత 71యొక్క మహాయుగముల సంవత్సర పరిమితమై యున్నది.
దాని సౌరాబ్దప్ర।। 30,67,20,000.
మను సంధి కాలప్ర।।17,28,000.
మనువు, ఇంద్రుడు,సప్త ఋషులు ఒకసం।।ప్ర।। 30,67,200.
అయనప్ర।। 15,33,600 ఋతుప్ర।। 5,11,200
మాసప్ర।।సౌ।। 2,55,600 అహోరాత్రప్ర।।సౌ।। 8520
దినప్ర।।సౌ।। 4,260 ఘటికా ప్ర।। 142సం।।.
వర్తమానములో వైవస్వత మనువునకు గతించిన సౌరసం।। 12,05,33,113

| | |
|---|---|
| మహాయుగ ప్ర।।సౌ।। | సం 43,20,000 |
| కృతయుగ ప్ర।।సౌ।। | సం17,28,000 |
| త్రేతాయుగప్ర।।సౌ।। | సం।।12,96,000 |
| ద్వాపర యుగప్ర।।సౌ।। | సం।।8,64,000 |
| కలియుగ ప్ర।।సౌ।। | సం।।4,32,000 |

సృష్టికాలమునకుముందు బ్రహ్మయొక్క ధ్యానము నందు గతించిన సం।।1,70,64,000.

| | |
|---|---|
| వర్తమాన కలియుగములో గతసౌరాబ్దములు | **5,118** |
| సృష్ట్యాదిగతసౌరాబ్దాః | **195,58,85,118** |
| హరిశ్చంద్రమహారాజాబ్దాః | **2,38,24,259** |
| నలమహారాజాబ్దాః | **1,36,13,966** |
| కార్తవీర్యాబ్దాః | **1,28,35,117** |
| రావణాబ్దాః | **1,25,69,117** |
| శ్రీరామచంద్రమూర్తి రాజ్యాంతాబ్దాః | **1,25,58,117** |
| భరతాబ్దాః | **5160** |
| శ్రీకృష్ణా వతారాబ్దాః | **5117** |
| పాండవాబ్దాః | **5117** |
| శూద్రకమహారాజాబ్దాః | **3173** |
| విక్ర మార్కాబ్దాః | **2073** |
| శాలివాహనశకాబ్దాః | **1939** |
| శ్రీశంకరా చార్యాబ్దాః | **1226** |
| రాజరాజనరేంద్రాబ్దాః | **1248** |
| భోజ మహా రాజాబ్దాః | **989** |
| శ్రీరామానుజాచార్యాబ్దాః | **999** |
| శ్రీమధ్వా చార్యాబ్దాః | **902** |
| శ్రీకృష్ణదేవరాయాబ్దాః | **524** |
| సంభూయవత్సరాః | **4,32,000** |
| వర్తమానశాలివాహనశక గతసౌరాబ్దములు | **1939** |
| ప్రభవాది గత సౌరాబ్దములు | **30** |
| వర్తమాన సంవత్సర నామం | **'హేమలంబ'** |

ఈ కలియుగమున యుధిష్ఠిర, విక్రమార్క, శాలివాహన, విజయాభి నందన, నాగార్జున, కల్కి అను 6 శకములు కలవు. యుధిష్ఠిర 3044, విక్రమార్క 135, శాలివాహనశక 18,000, విజయాభి నందన 10వే।।, నాగార్జున 4ల।।, కల్కిశక 821.

# శ్రీ హేమలంబ నామ సంవత్సర పీఠికా ప్రారంభము

అథాస్య ప్రవర్తమానస్య హేమలంబ నామ సంవత్సరస్య శ్రీశైలాది మహేన్ద్రగిరి మధ్యస్థ త్రైలింగదేశస్య రాజాదినిర్ణయః॥

**1. నవనాయకుల నిర్ణయము:** 1 రాజు-బుధుడు 2 మంత్రి-చంద్రుడు 3 సైన్యాధిపతి-శని 4 సస్యాధిపతి-గురుడు 5 ధాన్యాధిపతి-కుజుడు 6 అర్ఘాధిపతి -రవి 7 మేఘాధిపతి - రవి 8 రసాధిపతి-శని 9 నీరసాధిపతి - గురుడు.

**2. పురోహితాదుల నిర్ణయము :** 1. పురోహితుడు-గురుడు 2. పరీక్షకుడు - గురుడు 3.గణకుడు-శుక్రుడు. 4. గ్రామపాలకుడు-రవి 5. దైవజ్ఞుడు-రవి 6. రాష్ట్రాధిపతి-బుధుడు 7. సర్వదేశోద్యోగాధిపతి -చంద్రుడు 8. అశ్వాధిపతి-చంద్రుడు 9. గజాధిపతి-గురుడు 10. పశువులకధిపతి - రవి 11. దేవాధిపతి-గురుడు 12. నరాధిపతి-రవి 13. గ్రామాధిపతి-బుధుడు 14. వస్త్రాధిపతి-శని 15. రత్నాధిపతి-రవి 16. వృక్షాధిపతి-కుజుడు 17. జంగమాధిపతి-గురుడు 18. సర్వాధిపతి-శుక్రుడు 19. మృగాధిపతి-రవి 20. శుభాధిపతి-బుధుడు 21. స్త్రీలకధిపతి-రవి. శుభులధిపతులైన వారికి శుభఫలితములు, పాపులధిపతులైన వారికి చెడు ఫలితములు కలుగును.

**3. మేఘానయనము :** ఈ సంవత్సరములో "కాల" నామ మేఘము వచ్చును ఆగ్నేయ దిక్కునందు మేఘోత్పత్తి అగును.

**4.మేఘ చతుష్టయానము :** చతుర్మేఘపక్షమందు 1. 'పుష్కర' నామక మేఘము వచ్చును. 2 వివాహ నామక వాయువు వచ్చును. 3. అచలానామక మెరుపు వచ్చును. 4. నిర్ఘోష నామక ఉరుము వచ్చును. 5. క్షీర నామక సముద్రము వచ్చును. 6. శంఖ నామక ఆదిశేషువు భూమిని మోయును. 7. వర్షాధిపతి కుజుడు అగుచున్నాడు. 8. బలరాముడు పశుపాలకుడగుచున్నాడు. 9. మూడు ఆఢకముల పరిమిత వర్షము కురియును.

**5. ఆఢక హస్తంగతత్వ నిర్ణయము :** శని సంవత్సరాది నుండి (27-12-2017) పుష్య శు.నవమి బుధవారము వరకు ధనూరాశి ప్రథమ దశకమందుండుటచే ఆఢకము బాల్య బ్రాహ్మణ హస్తము నందును, తదుపరి సంవత్సరాంతము వరకూ ధనూరాశి రెండవ దశకము నందుండుటచే యౌవన బ్రాహ్మణ హస్తము నందుండును. దుర్భిక్షము కలుగును.

**6. ఆఢక ప్రమాణము :** మూడు ఆఢకముల పరిమిత వర్షము చేత 7 భాగములు సముద్రమందును, 10 భాగములు పర్వతముల పైన 4 భాగములు భూమిపైన వర్షించును.

6.1 వర్షధాన్యాదుల ప్రమాణములు: వర్షం19, ధాన్యం15, శీతం7, తృణం7, ఉష్ణం17, మారుతః13, ప్రజావృద్ధి15, ప్రజాక్షయము15, రాజవిద్వరము11, ఉగ్రం5, పుణ్యం5, పాపం5.

6.2 వ్యాధి13, ఉప13, ఆచాం19, అనాచార19, జననం17, మరణం17, దేశోపద్రవం5, దేశస్వాస్థ్యం19, చోరభయం 11, నాశ17, అగ్నిభయం5, నాశ11, మృగోపద్రవ21, నాశ19, కీటభయం5, నాశ15, మూషికోద్భవ17, నాశ11, సర్పోపద్రవ15, నాశ13, కామ5, క్రోధ 9, లోభ 9, మోహ5, మద15, మాత్సర్య5, సుఖ9, దుఃఖ11, భోగం11, విడంబ 9, మనోవ్యథా5, ద్వేషం17, ప్రతిష్ఠా11, అప్రతిష్ఠా21, ద్యూత13, ప్రమాదం21, నరోత్పత్తి11, స్త్రీ ఉత్పత్తి17, ధాతువాద 5, భయం9, శౌర్యం13, దుష్ట నిగ్రహం17, శిష్టప్రతి పాలన21, సత్యం7, అసత్యం9, విశ్వాసం11, అవిశ్వాసం13, దయ 15, నిర్భయం17, న్యాయం19, అన్యాయం3.

6.3 గోమాయువృ5,నాశం 9, సస్యకీటవృ3,నా9, శలభవృ 11, నా5, మశకవృ5,నా9, మత్కుణవృ7,నా9, వృశ్చిక వృ11,నా11, వ్యాఘ్రవృ3,నా7.

6.4 ఖగవృ3,నా2, గోవృ6,నా2, మహిషవృ6,నా6, మృగవృ2 నా5, అజవృ5,నా2, అశ్వవృ4,నా4, గజవృ2,నా2, ఉష్ట్రవృ3,నా3, విప్రవృ4,నా3, క్షత్రియవృ6,నా5, వైశ్యవృ5,నా2, శూద్రవృ6,నా4, మ్లేచ్ఛవృ5, నా5, సంకరవృ4,నా2, వజ్రవృ4, వైడూర్యవృ6, గోమేదికవృ3, పుష్య రాగవృ4. మరకతవృ5, మాణిక్యవృ1, నీలవృ1, మౌక్తికవృ 1, ప్రవాళవృ1॥

6.5 సువర్ణవృ14, రజతవృ10, తామ్రవృ2, కాంస్యవృ2, లోహవృ12, అయోవృ8, త్రపువృ10, సీసవృ10, రసవృ6.

6.6 జ్ఞానం15, అజ్ఞానం15, కాపట్యం13, నిష్కాపట్యం9, ధార్మికం7, అధార్మికమ్13.

6.7 విద్యుత్1, శిలాపాతం7, గర్జితం3.

6.8 స్వప్నం14, సుషుప్తి10, జాగ్రత్2, పైశునం2.

6.9 అండజవృ19,నా15, స్వేదజవృ7,నా7, ఉద్భిజ్జవృ17, నా13,జరాయుజవృ15,నా15, స్థావరవృ11,నా5, జంగమవృ5,నా5.

6.10 వ్రీహివృ14, శాలివృ14, కుళత్థవృ14, తిలవృ18, మాషవృ16, ముద్గవృ14, వర్షపవృ8, చణకవృ4, ఆఢకవృ14, గోధూమవృ12, కోద్రవ వృ4, ప్రియంగువృ10, యావనాళవృ12, శ్యామాకవృ6, రాజమాషవృ14, నీవారవృ16, శింబిధాన్యవృ12.

6.11 క్షుత్15, తృష9, నిద్ర3, ఆలస్యం5, ఉద్యోగం11, శాంతం 13, క్రోధః11, దంభః3, మిత్రభేదః15, మైత్రీ5, రసనిష్పత్తిః7, ఉత్సాహం11, ప్రాణిసౌఖ్యమ్9.

## 7. సంవత్సరాది ఫలము

**7.1 హేమలంబ నామ సం॥ర ఫలములు :** హేమలంబ నామ సంవత్సరమందు రాజులు పరస్పర శతృత్వములతో నుందురు. అధిక ధరలు, ప్రజాపీడయున్ననూ సుఖముగా నుందురు. మధ్యమవృష్టి, మధ్యమపంట, భయములు, ఖండవృష్టి, ప్రభువులకు సంక్షోభములు, స్వల్పజలములు కల్గును. అనావృష్టి, పెనుగాలులు,, శాకాహార, బంగారములకు హాని కలుగును.

### నవనాయకుల ఫలములు

**7.2 రాజుఫలము :** ఈ సంవత్సరములో రాజు బుధుడగుటచే అధికముగా వాయువులు వీచును. మధ్యమముగా వర్షించును. రోగములు, యుద్ధములు, రాజ క్రోధములు కలుగును. రెండవ పంట ఫలించును. లేఖకులకు అభివృద్ధి యుండును. నడక సాధువుగానున్నను, మంచిగా నడవని స్త్రీ పురుషులానందము పొందరు. మేఘములు అతిగా వర్షించిననూ మధ్యమముగా సస్యములు ఫలించును.

**7.3 మంత్రిఫలము :** ఈ సం॥రమున చంద్రుడు మంత్రి అగుట వలన మంచి వర్షములు కురిసి పంట బాగుగా పండును. క్షేమారోగ్యములతో దేశము సుభిక్షముగా నుండును.

**7.4 సైన్యాధిపతి ఫలము :** ఈ సం॥రము శని సైన్యాధిపతి యగుటచే సేనలు రాజును విడుచును. ప్రజలు అధర్మవర్తనులగుదురు. నల్ల ధాన్యము ఫలించును. రాజులు సేనాహీనులై అధర్మవర్తనులగుదురు. ప్రజలు పాపకర్మలు చేయుదురు. దుష్టకర్మలు చేయువారిచే శిష్టులు నష్టబోవుదురు. పాపాత్ములచే రాజులు కొలువబడుదురు.

**7.5 సస్యాధిపతి ఫలము :** ఈ సం॥రమున సస్యాధిపతి గురుడగుట వలన యవ, గోధుమ, శనగ ధాన్యములు, వృక్షజాతులు బహుళముగా ఫలించును. రాజులు నీతిమార్గమున నుందురు. గోవులు అధికముగా క్షీరములిచ్చును. ధరలు బాగుండును. భూమి అంతయు పచ్చగా నుండును.

**7.6 ధాన్యాధిపతి ఫలము :** ఈ సం॥రములో ధాన్యాధిపతి కుజుడగుట వలన యవలు మొ॥లగు ధాన్యములు నల్ల పెసలు మొదలగుధాన్యములు, ఎఱ్ఱని భూమిలోని పంటలు బాగుగపండును.

**7.7 అర్ఘ్యాధిపతి ఫలము :** ఈ సం॥రములో రవి అర్ఘ్యాధిపతి వలన ధరలు లేకుండుట, అల్పవృష్టి, ప్రజలకు ఆకలిబాధలు, రాజులకు అన్యోన్యవైరములు కల్గును. రక్తధాన్యవృద్ధి, రక్తమేఘములు జనించును. సూర్యుడర్ఘాధిపతియైన వత్సరమందు సూర్యవంశములో రాజులుదయింతురు.

**7.8 మేఘాధిపతి ఫలము :** ఈ సం॥రము రవి మేఘాధిపతి అగుటవలన మహాభయములు, స్వల్ప వర్షములు కలుగును. ఎఱ్ఱని పంటలు బాగుగా పండును.

**7.9 రసాధిపతి ఫలము :** ఈ సంవత్సరము శని రసాధిపతి అగుటవలన నువ్వులు, మినుములు, బొబ్బర్లు మొ॥లగు నల్ల ధాన్యములు, నల్లని భూములు బాగుగా పండును. మధ్యమ వర్షము కురియును. పంట తక్కువగా పండును. రసజాతులు, వేదములు క్షీణించును. మ్లేచ్ఛ దేశములకు వర్షము బాగుగా కురియును.

**7.10 నీరసాధిపతి ఫలము :** గురుడు ఈ సం॥రమున నీరసాధిపతి యగుట వలన పోకకాయలు (వక్కలు) సమస్త రత్నములు, సువర్ణము, ధాన్యములు, ప్రత్తి, చర్మములు, పూలు, చందనము వృద్ధిగా నుండును. ద్విజులు సుఖింతురు. పసుపు, పీతవర్ణ వస్త్రములు, వృద్ధిలో నుండును.

**7.11 పురోహితాదులు :** పురోహితాదుల కధిపతులు శుభులైనచో శుభమును, పాపులైనచో అశుభఫలములను కలిగించెదరు.

## దేశ వ్యవస్థచేత రాజాధిఫలముల నిర్ణయము

**1.** రాజునకు చెప్పిన ఫలములు పాంచాల, సౌరాష్ట్ర, విదర్భదేశముల వారికి వర్తించును. 2. మంత్రిఫలములు పౌండ్ర, కళింగదేశములకు, 3. సస్యాధిపతిఫలములు ఘూర్జర, యవన దేశాలవారికి 4. రసాధిపతికి చెప్పిన ఫలితములు కొంకణ,మాళవదేశములకు5. నీరసాధిపతి ఫల ములు మగధదేశమునకు 6. సేనాధిపతిఫలములు వంగ, పులిందదేశములకు 7.ధాన్యాధిపతి ఫలములు కోసల, కుంతల దేశాలకు 8. అర్ఘాధిపతి మేఘాధిపతుల ఫలములు సమస్త దేశముల వారికి వర్తించునని ప్రాచీనుల నిర్ణయము. ఆంధ్రదేశమందు ఆర్ద్రా ప్రవేశకాల ఫలములు చెప్పవలెనని దైవజ్ఞ సంప్రదాయము కలదు.

**2. మేఘాధి ఫలములు :** ఈ సం॥రములో 'కాల' నామక మేఘము వచ్చుటచేత అల్ప వర్షము కురియును. ఆగ్నేయ దిక్కునందు మేఘోత్పత్తి అగును.

చతుర్మేఘ పక్షమందు 'పుష్కర' నామక మేఘమువచ్చుటచేత దక్షిణ దిక్కున కురియును. 'వివహ' నామక వాయువు వీచుటచే వర్షము లేకుండుట జరుగును. 'అచలా' నామక మెరుపుచే సువృష్టి కురియును. 'నిర్ఘోష' నామక ఉరుము వచ్చుటచే అల్పవృష్టి, 'క్షీర' నామక సముద్రముచేత గాలులతో కూడి అల్పవృష్టి కురియును. 'శంఖ'నామక ఆదిశేషువు భూమిని మోయుటచే సమస్త సుఖములు కల్గును.వర్షాధిపతి 'కుజుడు' అగుట వలన అగ్ని,చోర,రోగభయములు రాజులకు యుద్ధములు, పంటనష్టములు, సర్పభయములు మెండుగా ఉండును. 'బలరాముడు' పశుపాలకుడగుటచే అన్నిదేశములయందు సువృష్టి కురియును. సర్వసస్యములు ఫలించును. మధ్యదేశము సుభిక్షమగును. ఆఢక త్రయ పరిమిత వర్షప్రమాణముచే దేశము సుభిక్షమగును. ఆఢకము బాల్య బ్రాహ్మణ హస్తమందుటచే వృష్టినాశము, సస్యనాశనము, దుర్భిక్షము కలుగును. యౌవన బ్రాహ్మణ హస్తమునకు వచ్చుటచే ఉత్తమ వర్షము కురియును. సస్యనాశనమగును.

**3. ఆర్ద్రా ప్రవేశ కాల ఫలములు :** రవి ఆర్ద్రా నక్షత్రమునందు జ్యేష్ఠ బ.నవమి ఆదివారము(ది 18-6-2017) రాత్రి గం 2-04 ని॥లకు ప్రవేశమగుటచే కలుగు ఫలము. నవమి తిథియందు ప్రవేశముచే కలహములు, ఆదివారమగుటచే పశునాశనము, రేవతీ నక్షత్రమగుటచే సదావర్షము, శోభన యోగమగుటచే శుభము, గరకరణమగుటచేదుర్భిక్షము, మేషలగ్నమగుటచే యుద్ధము, రాత్రి భాగమందు గుటచే పంటలు వృద్ధిలో నుండును. అర్థరాత్రి ప్రవేశమగుటచే అధిక ధరలు, వర్షములుండును. షణ్మండల పక్షమందు భరణ్యాది షష్ఠమ మండలమందు ప్రవేశమగుటచే క్షేమము కలుగును. సుభిక్షము, ఆరోగ్యము కలుగును.

## గ్రహచార ఫలములు

**1. రవిచార ఫలములు :** రవి మేషరాశిలో సోమవారమందు ప్రవేశించుట చేత సుభిక్షము. రాత్రియందు సూర్యాస్తమయానంతరము ప్రవేశించుటచే బహు సస్యవృద్ధి, చిత్తానక్షత్రమందగుటచే హాని కలుగును.

**2. చంద్రచార ఫలము :** జ్యేష్ఠ శు.పాడ్యమి శుక్రవారమగుటచే కీర్తి ప్రదముగా నుండును. ఆషాఢ శు.పంచమి బుధవారమగుటచే క్షేమము కలుగును. ఆషాఢ కృష్ణపక్షమందు రోహిణీ నక్షత్రము ద్వాదశీ యందు వచ్చుటచే సర్వసస్యములు నాశనమగును. ఆషాఢ శుక్లపక్షమందు స్వాతీ నక్షత్రము దశమి యందు వచ్చుటచే మంచి వర్షము కురియును. బీజావాపము (విత్తనములు నాటుట) చేయవచ్చును.

**3.పక్షవృద్ధి క్షయ ఫలములు :** ఈ సం॥రములో శుక్లపక్షమందు భాద్రపద కార్తిక మాసములు వృద్ధిని, చైత్ర, వైశాఖ, మాఘ, ఫాల్గుణ మాసములు క్షయమునూ పొందినవి. కృష్ణపక్షమందు ఫాల్గునమాసము వృద్ధిని, ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తిక మాసములు క్షయమునూ పొందినవి. చైత్ర బహుళ, వైశాఖ బహుళ, జ్యేష్ఠ, ఆషాఢ శుక్ల, శ్రావణ బహుళ, ఆశ్వయుజ శుక్ల, మార్గశీర్ష, పుష్య, మాఘ బహుళ మాసము పక్షములు సమానదినములు కలిగి ఉన్నవి. వీటి ఫలము శుక్లపక్షము పొందినప్పుడు బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యులకు వృద్ధి, కృష్ణపక్షము పొందినప్పుడు పైవారికి హాని, యితరులకు వృద్ధి కలుగును. సమాన మాసముల యందు సమఫలము ఉండును.

**4. కుజచార ఫలములు :** ఈ సంవత్సరారంభము నుండి కుజుడు మేషరాశిలో 7-4-2017 వరకూ సంచరించును. 8-4-2017 న వృషభరాశిలోనికి, 22-5-2017న మిధున రాశిలోనికి సంచరిస్తూ 30-5-2017న అస్తమించి 17-9-2017న ఉదయించును. 6-7-2017న కర్కాటకరాశిలోనికి, 22-8-2017న సింహరాశిలోనికి, 8-10-2017న కన్యారాశిలోనికి, 25-11-2017న తులారాశిలోనికి 12-01-2018న వృశ్చిక రాశిలోనికి, 1-03-2018న ధనూరాశిలోనికి సంచరిస్తూ సంవత్సరాంతమునకు ఇంచుమించుగా 9 రాశులు సంచరించును. ఈ సం॥రము కుజునకు వక్రచారము లేదు.

**5. బుధచార ఫలము :** ఈ సంవత్సరమున బుధుడు చైత్ర మాసమున అస్తమించి, వైశాఖమాసమున ఉదయించును.జ్యేష్ఠ మాసమున అస్తమించి ఆషాఢమాసమున ఉదయించును.

శ్రావణమాసమున అస్తమించి భాద్రపదమున ఉదయించును. ఆశ్వయుజమున అస్తమించి కార్తికమాసమున ఉదయించును. మార్గశీర్ష మాసమున అస్తమించి, పుష్యమాసమున ఉదయించును. మాఘమాసమున అస్తమించి, ఫాల్గున మాసమున ఉదయించును. అస్తమించిన మాసములయందు ప్రజలకు క్షేమారోగ్యములు, సుఖసంతోషములు కలుగును. ఉదయించిన మాసములయందు ప్రజాపీడలు,అనావృష్టి ఈతిబాధలు గోచరించును.

**6. గురుచార ఫలములు :** గురుడు సంవత్సరారంభములో కన్యారాశిలో చిత్తా నక్షత్రములో వక్రములో నుండి 8-6-2017న వక్రత్యాగమగును. 26-8-2017న తులారాశిలోనికి ప్రవేశించును. 11-10-2017న ఆశ్వయుజ మాసంలో పశ్చిమమున అస్తమించి 10-11-2017, కార్తికమాసంలో తూర్పున ఉదయించును. 30-1-2018న వృశ్చిక రాశిలోనికి ప్రవేశించి 8-2-2018న విశాఖ నక్షత్రము 4వ పాదమున వక్రించి సంవత్సరాంతమయ్యేను. గురుచారము వలన కన్యారాశిలో సంరించు సమయమున బ్రాహ్మణులు సంతోషముతో వృద్ధిలో నుందురు. జనులందరు యజ్ఞయాగాదులలో పాల్గొందురు. రాజులు స్వస్థులై, భూమండలమంతయూ సస్య సమృద్ధితోను మంచి ధరవరలతో నుండును. తులారాశి యందున్నప్పుడు తులకు చెప్పబడిన సమస్త వస్తువులు దుర్లభముగా నుండును. సువృష్టికురియును. వృశ్చికరాశిలో సంచరించునపుడు మదించిన రాజులు యుద్ధములో నశింతురు. అల్పవృష్టి, భయంకరమగు యుద్ధములు జరుగును. వర్షములు, పంటలు పరిపూర్ణముగా నుండునని, సమస్త వర్ణముల వారు సుఖముగా నుందురు.

**7. శుక్రచార ఫలములు :** ఈ సంవత్సరములో శుక్రుడు 31-3-2017న చైత్ర శు.తదియ శుక్రవారంనాడు ఉదయించి, మార్గశీర్ష శు. చతుర్దశి శనివారం (2-12-2017)నాడు అస్తమించును. మాఘ బ.విదియ శుక్రవారం(2-02-2018) నాడు పశ్చిమమున ఉదయించి సంవత్సరాంతము వరకుండును. శుక్రచారము వలన శుభకరముగా నుండును. ధనము సమృద్ధిగా నుండును. గోవులధిక క్షీరముల నిచ్చును. ధాన్యముతో భూమి సంపూర్ణముగా నుండును. అప్పుడప్పుడు భయానకములేర్పడును. వ్యాధి భయములు కలుగవు. బ్రాహ్మణ, క్షత్రియులకు సుభిక్షమగును, వృద్ధిగ నుండును. మిత్ర భేదములు ఎక్కువ అవకాశములు కలదు.

**8. శనిచార ఫలములు :** ఈ సంవత్సరము శని 5-4-2017న మూలానక్షత్రమున ధనూరాశిలో వక్రించి 26-8-2017న వక్రత్యాగమగును. సంవత్సరాంతము వరకూ ధనూరాశిలో సంచరించును. శని రెండు నక్షత్రముల సంచారము వలన మధ్యమ ఫలదాయకుడు మూలానక్షత్ర సంచారము వలన కాశీ, కోసల, పంజాబు దేశజనులు, ఫలములు, ఓషధులు, యోధులు పీడింపబడును. తక్షణకాలమందే రాజులకు యుద్ధములు సంభవించును. పూర్వాషాఢలో శని సంచరించుసమయములో అంగ,వంగ కోసల,గిరివ్రజ,మగధ,పాండు,మిథిల,తామ్రలిప్త నగర జనులు బాధింపబడుదురు. ధనూరాశిలో సంచారము వలన వృష్టిహాని, రాజులకు కలహములు, ధరలుపడిపోవును. మూలానక్షత్రములో శని వక్రించుటచే అవంతీ,యవన ప్రభువులు మరణింతురు.

**9. రాహుకేతు చార ఫలములు:** ఈ సంవత్సరములో రాహువు మఖ, ఆశ్లేష నక్షత్రముల యందు, కేతువు శతభిషం, ధనిష్ఠ, శ్రవణానక్షత్రములయందు సంచరించును. అనగా రాహువు సింహ,కర్కాటక రాశులయందును, కేతువు కుంభ,మకర రాశుల యందునూ సంచరించును. పై తెలిపిన నక్షత్ర, రాశులవారికి మనోవిచారములు అనారోగ్యములు,ధనక్లేశములు సూచించును.

**మకరసంక్రాంతి పురుష లక్షణము :** ఈ సంవత్సరములో పుష్య బ.దశమీ గురువారం అనగా 11-01-2018న ఘ 22-40 వి.ఘ (గం.3-43)లకు రవి మకరరాశిలోనికి ప్రవేశమగును.



గురువారమందు ప్రవేశమగుటచే "మందాకినీ" నామధేయము, బ్రాహ్మణులకు నాశనము కలుగును. వేపనీటి స్నానము చేయును కావున శుభము. సంక్రాంతి పురుషుడు చర్మ వస్త్రము ధరించునుగాన భూత బాధలు వచ్చును. సింధూర(పద్మ) గంధము లేపనము ధరించునుగాన హాని కల్గించును. పున్నాగ పుష్పము ధరించును గాన కీర్తి హాని కలుగును.

పుష్యరాగము ఆభరణముగా ధరించును గాన అశుభము కలుగును. కంచుపాత్ర ధరించుట వలన కంచు లోహమునాశనమగును. రోగము కలుగును. చిత్రాన్నము భక్షించుటచే పశు నాశనము కలుగును. మారేడు పండు భక్షణచే అతివృష్టి కలుగును. గుఱ్ఱమును అధిష్ఠించుట వలన ఇతరులకు కీడు కల్గును. కుంతాయుధ ధారణచే నిశ్చయముగా యుద్ధములు వచ్చును. నెమలి ఫించము ఛత్రమును ధరించుటవలన లేఖకులకు కీడు కలుగును. సర్పధారణ చేయుటవలన శిశువులకు హానికలుగును. ఈశాన్య దిక్కునకు పయనము గాన ఆ దిక్కున గల దేశములకు హాని కలుగును. చింతా చేష్టకలిగి క్రిందికి చూచుటవలన ప్రజలకుపీడ, సస్యవృద్ధి కలుగును. కృష్ణపక్షమందు ప్రవేశమగుటచే సువృష్టి కలిగి క్షేమమారోగ్య సుభిక్ష సంపదలు కల్గును. దశమి తిథివలన జనులకు అనురాగము కలుగును. గురువారమగుటచే సువృష్టి కలుగును. విశాఖనక్షత్రముచే అనిష్టములు కలుగును. అపరాహ్ణ కాలమునందు ప్రవేశించుటచే వైశ్యులకు హాని, మిథున లగ్న మగుటచే స్త్రీ పురుషులు, ఆనందించెదరు. పన్నెండవ(12)వ ముహూర్తమున ప్రవేశముచే సుభిక్షము కలుగును. మకర సంక్రాంతి పుణ్యకాలముందు పవిత్రనదీ స్నానముచేసి హెూమ, దాన, శ్రాద్ధాదులను జరుపుకొనవలెను. శక్త్యానుసారము కందమూల ఫలాదులు, కాంస్యాది పాత్రలు, ఫలములు, చర్మ, వస్త్ర, ధాన్య, ఆభరణములు, గోవులు మొ॥నవి దానమీయవలెను.

**1) కూర్మచక్ర వశముచే కలుగు ఫలములు :** శని ఈ సం॥రములో మూల, పూర్వాషాఢ, నక్షత్రముల యందు సంచరించుట చేత పారావతము, బర్బర, అవంతీ, పూర్వమాలము, సైంధవము, సురాష్ట్రము, త్రిగర్త మొ॥లగు దేశములకు హాని కల్గును.

**2) పూర్వసస్య వృద్ధి క్షయ నిర్ణయము :** ఈ సం॥రము మంత్రి చంద్రుడగుట వలన పూర్వసస్య (తొలిపంట) వృద్ధిగా నుండును.

## శ్రీ హేమలంబ నామ సం॥లో వాతావరణము - వర్షయోగములు 2017-2018

**1. చైత్రమాసము :- (ఉగాదినుండి)** మార్చి 29 నుండి 31 వరకు సాధారణ వాతావరణము కొద్దిపాటి చినుకులు పడే సూచన, ఏప్రిల్ 1 నుండి 7 వరకు కొద్దిగా ఎండలు పెరుగుట, 8 నుండి 10 వరకు కొద్దిపాటి చల్లదనము, చినుకులు పడేసూచన. 11 నుండి 17 వరకు వేడిగాలులు, కొద్దిపాటి ఎండలు, 18 నుండి 20 వరకు ఎండలు పెరుగుట. 21 నుండి 26 వరకు సాధారణ వాతావరణం ఎండలుతగ్గుట సాయంత్రములు చల్లగా నుండును.

**2. వైశాఖమాసము :-** ఏప్రిల్ 27 నుండి 30 వరకు క్రమముగా ఎండలు పెరుగును, సాయంకాలముల యందు చల్లదనము. మే 1 నుండి 4 వరకు ఎండలు బాగుగా ఉండుట, వేడిగాలులు వీచుట, 5 నుండి 8 వరకు ఎండలు పెరుగును. 9 నుండి 15 వరకు ఎండలు ముదురుట, వేడిగాలులు వీచుట. 16 నుండి 21 వరకు ఎండలు బాగుగా పెరుగును. 22 నుండి 25 వరకు వేడి గాలులు, ఎండలు ముదురును.

**3. జ్యేష్ఠమాసము :-** మే26 నుండి 28 ఎండలు పెరుగుట, వడగండ్లు కురియును. 29 నుండి 31 వేడిగాలులు వీచును. ఎండలు ఎక్కువ గును. జూన్ 1 నుండి 5 వాతావరణములో మార్పులు కలుగును. కొన్నిచోట్ల మాత్రము వేడిగాలులు, సాయంకాలం నందు వడగండ్లు, ఖండవృష్టి. 6 నుండి 8 వాతావరణం చల్లబడుట, గాలిలో మార్పులు ఉక్కపోతగా ఉండుట. 9 నుండి 11 వరకు తుషారము, గాలిచే వర్షము చెదురుట, 12 నుండి 18 వరకు అల్పవర్ష సూచన, ఉష్ణా ధిక్యము, 19,20 మెరుపులు, ఉరుములతో కూడిన వర్షము. 21,22 అడవి, పర్వత ప్రాంతాల్లో వర్షసూచన 23,24 వర్షాభావ సూచన.

**4.ఆషాఢమాసము :-** జూన్ 25,26,27 వర్షాభావము, అల్ప పీడనం, 28,29 అక్కడక్కడ కొద్దిపాటి వర్షము 30 తక్కువ వర్షము, జూలై 1 నుండి 5 రకు సముద్రతీరము నందు వర్షము, గాలులు వీచుట. 6 నుండి 8 ఉరములు, మెరుపులతో కూడిన వర్షము 9 నుండి 11 వరకు సాధారణ వాతావరణం, మేఘ సంచారం, పగటి యందు మబ్బులు కన్పించును. 12 నుండి 15 వరకు కొన్ని ప్రాంత ములలో వడగండ్లు, రంగుల వర్షములు కురియును. 16 నుండి 19 వరకు సాధారణ వాతావరణము, విపరీతమైన గాలులు పగటి యందు వీచును. 20 నుండి 23 వరకు సాధారణ ఎండలు, రాత్రుల యందు వర్షము. అడవులయందు విపరీతమైన గాలులు వీచును.

**5.శ్రావణమాసము :-** జూలై 24 నుండి 26 వరకు మేఘములు కదిలిపోవును, వర్షం కురియదు. 27 నుండి 29 తుషారము లేక చిన్నపాటి వర్షం. 30,31 గాలులతో కూడిన వర్షం. ఆగస్టు 1నుండి 4 వరకు సాధారణ వాతావరణం 5,6,7 సాధారణపు ఎండలు, తుషారము. 8 నుండి 10 వరకు చల్లదనము కొద్దిపాటి వర్షసూచన. 11 నుండి 13 విపరీతమైన గాలులు, ఉరుములు, పిడుగులతో కూడిన వర్షము.

**6.భాద్రపదమాసము:-** ఆగస్టు 22,23 సాధారణ వాతావరణం, పగటిపూట సాయంత్రము వేళలో మబ్బులు. 24 కొద్దిపాటి వర్ష సూచన. 25చిరు జల్లులు. 26 నుండి 28 వరకు మబ్బులు కన బడును. (మేఘములుండును) వర్షముండదు. 29,30 కొంచెం ఎండలు. సాయంత్రం చల్లగానుండును. మెరుపులు ఉరుములుం డును. 31 కొద్దిపాటి వర్షసూచన. సెప్టెం 1 నుండి 3 సముద్ర ప్రాంతముల యందు, పర్వత ప్రాంతములయందు వర్షసూచన. (అడవులయందు నష్టము) 4 నుండి 6 వరకు అధిక వర్షము, మేఘడంబరము ఉండును. 7 నుండి 10 సాధారణ ఎండలు, సమశీతోష్ణస్థితి. 11 నుండి 13 వరకు సాధారణ వాతావరణం, గాలులు వీచును. 14 నుండి 17 కొద్దిపాటి వర్షసూచన, సాయంత్రం వేళలో మబ్బులు పట్టుట. 18 నుండి 20 వరకు పగటి వేళల యందు వర్షసూచన.

**7.ఆశ్వయుజమాసము :-** సెప్టెంబరు 21 నుండి 23 వరకు వాతావరణంలో మార్పులు, సాయంత్రముల యందు చల్లగా నుం డును. చిరుజల్లులు కురియును. 24,25 సాధారణఎండలు, 26,27 కొద్దిపాటి వర్షసూచన. 28,30 సాధారణ ఎండలు. ఆకాశం నందు మబ్బులు కన్పించును. అక్టోబరు 1 నుండి 3 కొద్దిగా చలిప్రవే శించును. చల్లగానుండును, 4 నుండి 7 వరకు వాతావరణములో మార్పులు కలుగును. చల్లదనం, 8 నుండి 11 వరకు సాధారణ ఎండలు, సాయంకాలముల యందు చల్లగాలి, అప్పుడప్పుడు చిరుజల్లు లుండును. 12 నుండి 19 వరకు సాధారణ ఎండలు, చల్లదనము.

**8. కార్తికమాసము:-** అక్టోబరు 20,21 పగటిపూట చిరుజల్లులు, కొద్దిపాటి గాలులు వీచును. 22,23,24 పగటిపూట సాధారణ ఎండ, సాయంకాలముల యందు కొద్దిగా చలి ఉండును. 25 నుండి 29 వరకు సాధారణ వాతావరణం, పగటిపూట ఎండ మామూలుగా నుండును. 30,31 చలిగాలులు వీచును. కొద్దిపాటి గాలులు వీచును. నవంబర్ 1 నుండి 4 వరకు సాధారణ వాతావరణం, చలి తగ్గును. 5 నుండి 11 వరకు మిశ్రమ వాతావరణం, 12 నుండి 18 వరకు సాధారణ ఎండలు, క్రమంగా చలిపెరుగుట, తగ్గుట ఉండును.

**9.మార్గశీర్షమాసము :-** నవం 19 నుండి 21 వరకు సాధారణ వాతావరణం, చలిక్రమంగా పెరుగుట, 22నుండి 25 వరకు కొన్ని చోట్ల చలిగాలులు బాగుగా వీచుట, 26 నుండి 30 వరకు సాధారణంగా పగలు ఎండలు, వాతావరణంలో మార్పు చలి పెరుగుట, డిశంబరు 1 నుండి 4 వరకు చలిపెరుగును. 5 నుండి 10 పగటియందు చలిగలులు, సాయంత్రం నందు బాగుగా చలి వుండును. 11 నుండి 18 వరకు మిశ్రమ వాతావరణం, సాధారణ ఎండ, చలి పెరుగుట కొన్నిచోట్ల వర్షసూచన.

**10.పౌషమాసము :-** డిశంబరు 19 నుండి 21 వరకు సాధారణ ఎండలు, రాత్రుల యందు చలి, 22 నుండి 25 పగలు చలిగాలులు, కొన్నిచోట్ల మంచు కురియుట, 26 నుండి 31 వరకు పగలు చలి బాగుండుట, రాత్రులయందు పొగమంచు, చలి ఎక్కువగుట, జనవరి 1 నుండి 5 కొన్ని ప్రాంతములలో మంచు కురియుట, చిరు జల్లులు, 6 నుండి 10 వరకు పగటి వాతావరణంలో మార్పు, రాత్రియందు చలి, మంచు కురియుట. 11 నుండి 17 వరకు పగటి యందు కొద్దిపాటి మంచు, చిరుజల్లు చలి ఎక్కువగా ఉండుట.

**11.మాఘమాసము :-** జనవరి 18 నుండి 21 వాతావరణంలో మార్పు చలి కొద్దిగా తగ్గును. 22 నుండి 25 పొగమంచు కొన్నిచోట్ల చిరు జల్లులు, 26 నుండి 31 వరకు చలి తగ్గుట, పెరుగుట ఉం డును. ఫిబ్రవరి 1 నుండి 5 పగలు ఎండ పెరుగుట, రాత్రుల యందు చలి తగ్గుట 6 నుంచి 10 వరకు చలి తగ్గుట, ఎండలు పెరుగుట, 11 నుండి 15 వరకు చలి పెరుగుట, ఎండలు పెరుగుట.

**12. ఫాల్గునమాసము :-** ఫిబ్రవరి 16 నుండి 20 వాతావరణంలో క్రమేపి వేడి పెరుగును. చలి తగ్గును. 21 నుండి 23 సమశీతోష్ణస్థితి ఉండును. 24 నుండి 28 వరకు రాత్రుల యందు తెల్లని మేఘములు కన్పించును. మార్చి 1 నుండి 5 వరకు రాత్రుల యందు ఆహ్లాదము, పగటియందు వేడి పెరుగుట 6నుండి 10 వరకు పగలు వేడి పెరు గుట, రాత్రుల యందు చల్లగా ఉండుట. 11 నుండి 15 వరకు రాత్రుల యందు వేడి, పగలు వేడిగానుండుట, సాధారణ ఎండలు.

-// సమాప్తం //-

అనుబంధం

శ్రీ మహాగణాధిపతయే నమః

# ఉపయుక్తాంశములు

## 1. వ్యవసాయదారులకు

**1.1 పశువులనుకట్టుటకు :** ఆది,సోమ,గురు,శుక్రవారములు, కృత్తి,మృగ, ఆర్ద్ర,మూల,పూర్వాషాఢ,పూర్వాభాద్ర,రేవతి నక్షత్రము లందు పశుశాలలో పశువులనుకట్టుట మంచిది. అష్టమి,చతుర్దశి, అమావాస్య, రోహిణి,ఉత్తర,చిత్త,ఉత్తరాషాఢ,శ్రవణం నక్షత్రములు పనికిరావు. తక్కిన తిథి వారాదులు మధ్యమములు.

**1.2 భూమిలో ప్రవేశించుటకు :** కుజ,బుధ,గురు,శుక్రవారములు, అశ్విని,రోహిణి,మఘ,ఉత్తర, హస్త,చిత్ర, స్వాతి,అనూ, మూల,ఉషా, ధని, ఉభా, రేవతులు,అమావాస్య,పాడ్యమి,చవితి,నవమి,చతుర్దశి తిథులుగాక తక్కిన తిథులు, వ్యతీపాతము, వ్యాఘాత, వైధృతి అనెడి యోగములు కాక మిగిలిన యోగములు, భద్రకరణమును విడిచి మిగిలిన కరణములు వ్యవసాయారంభమునకు, భూమిలో ప్రవేశించు టకు శ్రేష్ఠములు.

**1.3 విత్తనములు జల్లుటకు :** తదియ, పంచమి, ఏకాదశి, త్రయోదశి పూర్ణిమలు శ్రేష్ఠములు. పాడ్యమి, షష్ఠి, సప్తమి, దశమి తిథులు మధ్య మము, మిగిలిన తిథులు పనికిరావు. రోహిణి,పుష్య,ఉత్తర,హస్త, స్వాతి, అనూ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి 9నక్షత్రములు శ్రేష్ఠ ములు. భరణి, కృత్తిక, ఆశ్రేష, పుబ్బ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర 7 నక్షత్రములు పనికిరావు. మిగిలిన 11 నక్షత్రములు మధ్యమముగా గ్రహింపవచ్చును.

**1.4 దుంపతోటలు వేయుటకు :**భరణి,కృత్తిక,ఆశ్రేష,మఘ,పుబ్బ, విశాఖ, మూల,పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములందు, మంగళ, గురు,శని వారములందు కంద,పెండలం,దుంపలు,పసుపు మొదలగు దుంపతోటలను వేయుటకు మంచిది.

**1.5 సెనగలు,గోధుమ,కంది, మొ॥ విత్తనములు జల్లుటకు :** రోహిణి, మృగ,పున,ఉత్తర,స్వాతి,అనూ,మూల,ఉ॥షాఢ,శ్రవణ,ధని,ఉ॥భాద్ర,రేవతి 12 నక్షత్రములు బుధ,గురు,శుక్రవారములు మంచివి, మరియు పుష్య,మఖ,ఉత్తర,విశాఖ,అనూ,మూల,ఉషా,శ్రవణ,ఉభా, రేవతి యీ నక్షత్రములందు సమస్త విత్తనములు జల్లుటకు మంచిది.

**1.6 అరటి, మామిడి వేయుటకు :** అశ్వి, మఘ,పుష్య,ఉత్తర,అనూ, ఉభా,రేవతి నక్షత్రములందు, 3,5,8,10,13,15 తిథులందు బుధ, గురు,శుక్రవారములందు వేయుటకు మంచిది.

**1.7 కొబ్బరిచెట్లునాటుటకు :** అశ్వి,మృగ,పుష్య,హస్త,అనూ,మూల,ఈ 6నక్షత్రములందు కొబ్బరి,ఉసిరి,పోక మొ॥గు చెట్లనునాటుట మంచిది.

**8. పొగతోట :** అశ్వి,భర,మృగ,ఆర్ద్ర,పుష్య,స్వాతి నక్షత్రములందు ఆది,మంగళ,గురువారములందు పొగతోట వేయుటకు మంచిది.

**1.9 ఉల్లితోట :** అశ్వి,మృగ,పున,పుష్య,హస్త,అనూ,జ్యేష్ఠ,మూల, శ్రవ,శతభిష,ఉభా,రేవతి నక్షత్రములందు. ఆది,సోమ,గురు వారములందు 5,10,15 తిథులందు సింహ,వృశ్చిక,ధనుః,మకర, కుంభ,మీనలగ్నములందు ఉల్లితోట పాతుటకు మంచిది.

**1.10 కొత్తధాన్యం తెచ్చుటకు :** మృగ,పుష్య,హస్త,చిత్ర,అనూ,రేవ నక్షత్రములందు సోమ,గురు,శుక్రవారములందు పొలము నుండి క్రొత్తధాన్యము ఇంటికి తెచ్చుటకు మంచిది.

**1.11 భూమి దున్నుటకు :** రోహి, పునర్వసు, పుష్యమి,ఉత్తర, హస్త, అనూరాధ, మూల, ఉ.షాఢ, ఉ.భాద్ర, రేవతి నక్షత్రములు, సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి.

## 2. సర్వకర్మలయందు సాధారణముగా పాటించవలసిన నియమములు

**2.1 శుభకార్యములు చేయకూడని కాలములు :**

జన్మమాసము, జన్మతిథి, వ్యతీపాతయోగము, భద్రకరణము. వైధృతియోగము, అమావాస్య, మాతాపితరుల మరణదినము, శ్రాద్ధదిన ములు, క్షయతిథి (ఒకదినములో 60 ఘడియలలో మూడు తిథులు కలిసినప్పుడు ఆ దినమందు మధ్యతిథికి (క్షయతిథికి) క్షయతిథి అనిపేరు), వృద్ధితిథి (ఒక తిథి మూడుదినములతో సంబంధం కలిగి యున్నప్పుడాతిథికి వృద్ధితిథి అనిపేరు), అధికమాస, క్షయమాసములు, కులిక ముహూర్తము అర్ధయామము, వ్యతీపాత, వైధృతీయను మహాపాత దినములు వీనిని తిథులలో వ్రాయబడు వ్య॥ప్ర., వై.ప్ర., అను సంకేతములను బట్టి గుర్తించవలెను. విష్కుంభ, వజ్రయోగముల యొక్క మొదటి 8ఘ॥లు, పరిఘయోగము యొక్క మొదటి 3ఘ॥లు (పరిఘయోగము యొక్క మొదటి 30 ఘ॥(మొదటిసగము), శూల యోగము యొక్క మొదటి 5 ఘ॥లు, గండ,అతిగండ యోగం మొదటి 6 ఘడియలు, వ్యాఘాత యోగములో మొదటి 9 ఘ॥లు ఇవి సర్వశుభ కార్యములందు సాధారణంగా విడువతగినవి. (కృత్య విశేషమునుబట్టి వీనియందుకొన్ని అంగీకరించ వచ్చును.)

**2.2 జన్మనక్షత్రమందు చేయదగు కృత్యములు :**

నిషేకము, యాగము, చౌలము, అన్నప్రాశనము, నవాన్నభుక్తి, వ్యవసాయము, ఉపనయనము, పట్టాభిషేకము, భూసంపాదనము, అక్షరాభ్యాసములను చేయవచ్చును.

**2.3 జన్మనక్షత్రమందు చేయకూడని కృత్యములు :**

పుంసవనము, యుద్ధము, సీమంతము, గర్భాదానము, శ్రాద్ధము, క్షౌరము, ఔషధసేవప్రారంభము, ప్రయాణము, పురుషులకు వివా హము, జన్మ నక్షత్రములో చేయతగదు. స్త్రీలకు వివాహము జన్మనక్షత్ర ములో చేయవచ్చును, మంచిది.

## 3. గురు,శుక్ర మూఢములందు, అధిక-క్షయ మాసములందు చేయకూడని కృత్యములు:

వాపి(దిగుడుబావి), కూప(నుయ్యి), తటాక (చెరువు) ఆరామము (తోట)ల యొక్క నూతన ప్రారంభము, నూతన గృహప్రవేశం, నూతన గృహారంభం, నూతనవ్రతారంభములు, మహాదానములు, సోమ యాగము, అష్టకాశ్రాద్ధము, గోదానవ్రతం, అగ్రయణం,జలశాలా రంభము, ప్రథమమందారంభించు ఉపాకర్మ, వేదవ్రతములు, మహా నామ్ని వ్రతం, ఉపనిషద్వ్రతం (మహావ్రతము), నీలోద్వాహం, కామ్య వృషోత్సర్జనం, అతిపన్న శిశుసంస్కారములు (విహితకాలమందు చేయ

బడని జాతకర్మ నామకరణాదులు), మంత్రదీక్ష, చౌలము, ప్రథమంగా చేయబడు దేవదర్శనము, తీర్థదర్శనము, అగ్నిహోత్రారంభము, చాతుర్మాస్య వ్రతారంభము సమావర్తనము తప్తమాషాది పరీక్ష, ఉపనయనం, వివాహం,సన్యాసస్వీకారం దేవతాప్రతిష్ఠ, రాజసేవారంభము ఈకృత్యములను గురు,శుక్రుల బాల్య-వార్ధక్యావస్థలందు, అస్తమయములందు అధికక్షయమాసములందు ఆరంభింప తగదు.

**3.1 గురు-శుక్ర మూఢములందు చేయదగు పనులు :**

గర్భాదానము, పుంసవనము, సీమంతం, జాతకర్మ నామకరణం, నిష్క్రమణము, అన్నప్రాశనము, గతంలో ప్రారంభింపబడిన వాపీకూప తటాకారామ గృహాదులయొక్క కార్యములు, జీర్ణ గృహప్రవేశము, అన్య నిర్మిత గృహప్రవేశము (అద్దెయిల్లు),(పంచభూతములు మరియు ప్రభువు మొ॥లగు వారిచే భ్రష్టము కాబడి తిరిగి నూతనంగా చేయబడిన గృహమును ప్రవేశించుట, యాత్రా నివృత్తి తరువాత గృహప్రవేశము అనగా రెండవపర్యాయము గృహమునుప్రవేశించుట చేయవచ్చును). మరియు సూర్యచంద్ర గ్రహణములు, అర్థోదయము, కపిలాషష్ఠి, సూర్యసంక్రాంతి, వీని నిమిత్తముగా చేయబోవు అపూర్వ తీర్థయాత్రలు, గయాశ్రాద్ధ నిమిత్తముగాని గోదావరి తీర్థయాత్ర చేయుటకు గురు శుక్ర మూఢములు పాటించనవసరం లేదు.

**3.2 గురు శుక్రులకు బాల్య-వార్ధక్యావస్థల నిర్ణయము :**

గురుడు ఎల్లప్పుడు తూర్పుదిక్కున ఉదయించును. పశ్చిమమున అస్తమించును. గురుని ఉదయ దినము నుండి తర్వాత 5 దినములు బాల్యావస్థ, గురుని అస్తమయ దినమునకు పూర్వము 5 దినముల నుండి వార్థక్యావస్థ వచ్చును.

శుక్రుడు ఒకప్పుడు తూర్పున ఉదయించును. పశ్చిమాన అస్తమించును. ఒకప్పుడు తూర్పున అస్తమించును. పశ్చిమమున ఉదయించును. తూర్పున ఉదయించినప్పుడు ఉదయము నుండి 5 దినములు బాల్యావస్థ, పశ్చిమమున ఉదయించినప్పుడు ఉదయము నుండి 7దినములు బాల్యావస్థ తూర్పున అస్తమించినప్పుడు అస్తమయ దినమునకు 7 దినములు పూర్వమునుండి వార్థక్యావస్థ వచ్చును.

ఉదయానంతరం బాల్యావస్థ అస్తమించుటకు పూర్వం వార్ధక్యావస్థయని భావము. వీరల అస్తమయము నందువలె బాల్యావార్ధక్యావస్థల యందు కూడా వివాహాది శుభకర్మల నాచరించరాదు. వివాహ విషయములో అతి ముఖ్యముగా విడువవలయును. ఇచ్చట వింధ్య పర్వత దక్షిణ దేశవాసుల విషయమై మతాంతరము కలదు.

"వింధ్యస్య దక్షిణదేశే వృద్ధబాల్యే సితేజ్యయోః

త్రిదినం వర్జయిత్వాతు తతః కుర్యాత్తుశోభన" మితి

గురు శుక్రుల బాల్యవార్ధక్యావస్థలలో వింధ్య పర్వత దక్షిణ దేశస్థులు 3 దినములు మాత్రం పరిత్యజించి మిగిలిన దినములలో వివాహాది శుభకర్మలు చేయవచ్చునని కొందరి అభిప్రాయము.

# 4. జనన ప్రకరణము

**4.1 జననమునకు దుష్ట నక్షత్రములు :**

| నక్షత్రములు | 1వ పాదం | 2వ పాదం | 3వ పాదం | 4వ పాదం |
|---|---|---|---|---|
| అశ్విని | శిశుగండం | శుభం | శుభం | శుభం |
| భరణి | శుభం | శుభం | పితృమాతృగండం | శుభం |
| కృత్తిక | శుభం | శుభం | పితృమాతృగండం | శుభం |
| రోహిణి | మేనమామ గండం | మేనమామ గండం | మేనమామ గండం | మేనమామ గండం |
| ఆశ్రేష | శుభం | ధనహాని | మాతృగండం | పితృగండం |
| మఘ | శిశుగండం | శుభం | శుభం | శుభం |
| ఉత్తర | పితృమాతృగండం | శుభం | శుభం | శుభం |
| హస్త | శుభం | శుభం | పితృమాతృగండం | శుభం |
| చిత్త | పితృమాతృగండు | పితృమాతృగండు | శుభం | శుభం |
| విశాఖ | దోషము | దోషము | దోషము | దోషము |
| జ్యేష్ఠ | సౌఖ్యహాని | ధనహాని | పితృగండం | మాతృగండం |
| మూల | దోషము | దోషము | దోషము | శుభం |
| పూ.షాఢ | శుభం | శుభం | పితృమాతృగండం | శుభం |
| రేవతి | శుభం | శుభం | శుభం | శిశుగండం |

పుష్య 2,3 పా॥లు,అమావాస్య,వ్యతీపాత,వైధృతి,రవిసంక్రమణ సూర్యచంద్రగ్రహణ సమయం, నక్షత్రగండాంత, తిథిగండాంత, జన్మ గండాంతములు, దినక్షయ,భద్ర,యమ గండం, దగ్ధయోగం, దారుణ మృత్యుయోగములు, దుష్టతిథి, దుష్టయోగములు, వర్జ్యఘడియలు, దుర్ముహూర్తములు వీనియందు జన్మించినచో వానికి విధించిన శాంతిని శాస్త్రోక్తముగా జరుపవలెను.

**3.2 పిత్రాది నక్షత్రములలో జననమైతే :**

తల్లిదండ్రుల జన్మనక్షత్రములలోను, సోదర సోదరీల జన్మనక్షత్రములలోను జననమైతే శాస్త్రోక్తముగా సంపూర్ణ శాంతి చేసుకొనవలయును. (ఏక నక్షత్ర జనన శాంతి)లింగభేదమున్నచో దోషములేదు.

**3.3 ఆశ్రేష,మఘ,జ్యేష్ఠ,మూల** నక్షత్రములందు 4వ పాదములో జన్మించుటచే దోషము లేకపోయినను పితృమాతృవర్గముల కరిష్టములు లేకపోయినను గోప్రసవశాంతిని మరియు నక్షత్రశాంతిని గూడ చేయవలయును.అశ్విని,పుష్య,చిత్ర,రేవతీ నక్షత్రములందు నక్షత్ర శాంతి లేకపోయినను గోప్రసవశాంతి చేయవలయును.

**3.4.** బహుళ చతుర్దశిని 6 భాగములు చేయగా 1వ భాగం శుభం, 2వభాగం తండ్రికరిష్టం, 3వ భాగం తల్లికరిష్టము, 4వ భాగము మేనమామ కరిష్టము, 5వ భాగము వంశమునకు దోషము, 6వ భాగము ధననాశనము, తన కుటుంబమునకు కీడు కలుగును. వీనిలో 2,3,6 భాగములందు జననమైనచో గోముఖప్రసవ పూర్వక చతుర్దశి శాంతిని చేయవలయును. 1,4,5,భాగములందు జనన మైనచో కేవలం చతుర్దశి జనన శాంతిని చేయవలయును.

**3.5 సినివాలీ కుహూ జననశాంతి:**

సినివాలీకుహూ సంజ్ఞక అమావాస్య యందు జననమైనచో కృష్ణ చతుర్దశి శాంతివలె శాంతి చేయవలయును.(కుహూ జనన మందు గోప్రసవమునుగూడ చేయవలయునని కొందరి మతం). అమావాస్య జననమునకు శాంతిచేయవలయును.

**3.6. జ్యేష్ఠ,మూలాది నక్షత్రములందు జనన విషయము:**

మూల ఒకటవపాదమందు తండ్రికి,2వపాదమందు తల్లికి, 3వ పాద మందు ధనమునకు హాని, 4వ పాదమందు దోషములేదు. జ్యేష్ఠా నక్షత్రము యొక్క చివర 1 ఘ॥, మూలయొక్క మొదటి 2 ఘ॥లు సంధికాలము. దీనికి 'అభుక్త' మూల అనిపేరు. కొందరు జ్యేష్ఠాంత మందు 2ఘ॥లు, మూలాదియందు 2 ఘ॥లు మొత్తం 4 ఘ॥లు సంధికాలమును 'అభుక్త' మూలమనుచున్నారు. ఇది విశేష దోషమగు టచే శాంతిని చేయవలయును.

3.7. జ్యేష్ఠానక్షత్ర ప్రమాణమును 10 భాగలుగచేసి అందు 1వ భాగమందు జననమైతే మాతామహికి, 2వభాగం మాతామహు నకు 3వ భా॥మేనమాకు 4వ భా॥ తల్లికి 5వభా॥ శిశువునకు, 6వ భాగం జ్ఞాతులకు, 7వ భా॥మాతృపితృ వర్గములకు, 8వ భా॥జ్యేష్ఠ సోదరు నకు, 9వ భా॥భార్య తండ్రికి 10వ భాగమందు సంపదహాని కలు గును. కనుక జ్యేష్ఠా నక్షత్రమందు ఏ భాగమందు జననమైనా శాంతి చేయవలయును.

3.8. చిత్రాది నక్షత్రములలో జననమైనప్పుడు చిత్రా 1,2పా॥ లందు జననమైతే గోప్రసవశాంతినిచేసి నక్షత్రాధిపతి ప్రతిమకు పూజచేయవలయును. పుష్య 3,4 పాదములందు జననమైతే గోప్రసవ శాంతిని, నక్షత్రాధిపతి ప్రతిమకు పూజ, గోదానము చేయవలయును. ఉత్తరా ప్రథమపాద జననమైతే నక్షత్రాధిపతిపూజను తిలపాత్ర దానమును, పూ.షాఢ 3వ పాదమందు జననమైతే నక్షత్రాధిపతికి పూజను, స్వర్ణదానమును చేయవలయును. మఘప్రథమపాద జననమైతే మూల నక్షత్రమునకు చేసినట్లు శాంతిని చేయవలయును. మఘ నక్షత్రములో మొదటి 2 ఘ॥లలో జననమైతే నక్షత్రగండాంత శాంతిని చేయ వలయును. రేవతి యొక్క చివరి 2 ఘ॥లలోను అశ్విని మొదటి 2 ఘ॥లలోను జననమైతే నక్షత్ర గండాంత శాంతిని గోప్రసవ శాంతిని గ్రహారాధనమును చేయవలయును. రేవతి, అశ్వినుల ఇతర ఘ॥లందు, మఘ 2,3,4 పా॥లకు శాంతి అవసరం లేదు. విశాఖ 4వ పాదమందు జననమైతే నవగ్రహ మఖము (యజ్ఞము)ను చేయవలయును.

3.9. వ్యతీపాత వైధృతి రవి సంక్రమణ కాలమందు జనన మైనచో గోముఖప్రసవమును నవగ్రహ జపమును చేయవలయును.

3.10. గ్రహణ సమయమందు జననమైనచో గోముఖ ప్రసవ శాంతిని చేయవలయును.గ్రహమఖమువికల్పము మరియు సూర్య గ్రహణమైతే నక్షత్రదేవత సూర్యరాహువుల ప్రతిమలను పూజింప వలెను. చంద్ర గ్రహణమందునక్షత్రదేవత చంద్రరాహువుల ప్రతిమ లను పూజించ వలయును. దీనికి కలశ స్థాపనాదిక మవసరములేదు.

3.11. తిథి గండాంతము, దినక్షయవృద్ధులు భద్ర యమఘంట దగ్ధ యోగ, మృత్యు దోషములు కలిస్తే నవగ్రహ మఖము, అశ్వత్థ ప్రదక్షణాది శాంతి మొత్తము చేయవలయును.

3.12. విష ఘ॥లందు జననమైతే నవగ్రహమఖము, రుద్ర యమ అగ్ని మృత్యు దేవతారాధనలు చేసి ప్రతి దేవతలకు 108 హోమములు చేయవలయును.

3.13. యమల జనన (కవల పిల్లలు) మైతే గ్రహముఖముతో బాటు కాత్యాయనోక్త శాంతిని చేయవలెను.

3.14. త్రికప్రసవం (ముగ్గురు ఆడపిల్లల తరువాత మగపిల్ల వాడు కలిగినను, ముగ్గురు మగపిల్లల తరువాత ఆడపిల్ల కలిగినను) గో ప్రసవ శాంతిని చేయవలెను.

3.15. సదంత జననము : దంతములలో శిశువు పుట్టినచో దంత జనన శాంతిని చేయవలెను.

3.16. నాలవేష్ఠిత జననము : మెడలో పేగుతో పుట్టినచో నాళ వేష్ఠిత శాంతిని చేయవలయును.

## 4. గృహస్థులు పాటించ వలసిన నిత్యకృత్య శుభాశుభ విషయములు

**4. రజస్వల విషయమై దుష్ట తిథి,వార నక్షత్రములు:**

1. రెండు పక్షములందు 1,4,6,8,9,12,14 తిథులయందును, అమావాస్యయందును, ఆది,మంగళ,శనివారములయందు భరణి, కృత్తిక ఆరుద్ర,పునర్వసు,ఆశ్రేష,మఘ,పూ.ఫ, జ్యేష్ఠా,పూ.షా,పూ.భా యీ నక్షత్రములయందును ప్రథమ రజస్వల ఆయ్యేనేని శాస్త్రోక్తముగా శాంతిని చేసుకొనవలెను.

**2. నూతన వస్త్రధారణ:**

2,5,7,8,10,13 తిథులును బుధ,గురు,శుక్రవారములును అశ్విని, రోహి,మృగ,పున,పుష్య,ఉత్తరాత్రయము,హస్త,చిత్త,స్వాతి, విశాఖ, అనూరాధ, శ్రణము, ధనిష్ఠ, శతతార, రేవతియీ నక్షత్రములు నూతన వస్త్రధారణకు యోగ్యములు.

**3. మంచము నేయుటకు, కొనుటకు, వాడుకొనుటకు:**

ఆదివారము లాభము, సోమవారము సుఖం, మంగళవారం అగ్ని దగ్ధం, బుధవారం రోగం, గురువారం పుత్రలాభం, శుక్రవారం సౌఖ్యం, శనివారం మరణం.

**4. ఇంటిమీద గ్రద్దవాలుట:**

గృహమధ్యమము, ఆగ్నేయం, దక్షిణం, వాయవ్యము, ఈశాన్యం దిక్కులందు ఇంటిమీద గ్రద్ద వాలినచో ఇంటిలో ఉండకూడదు. మూడు మాసములు ఇంటిని విడువవలెను. లేకుంటే గృహశాంతిని చేసుకొన వలెను. శాంతిచేసుకుంటే ఇల్లు విడువనక్కరలేదు.

**5. తేనెపట్టు పట్టుట:**

ఇంటిమధ్య యజమానునకు మరణం, తూర్పున ధనలాభం, ఆగ్నేయమున అగ్నిభయం, దక్షిణమున మరణం, నైఋతి ధాన్యనాశ నం, పడమర మనఃపీడ, వాయువ్యం ధనం వలన దుఃఖం, ఉత్తరమున పుత్రహాని, ఈశాన్యమున మిత్ర దర్శనము.

**6. బల్లిపడినను, తొండప్రాకినను కలుగు ఫలము:**

బ్రహ్మస్థానమున రాజ్యం, లలాటమున చెవులయందు లాభం, నేత్రముల యందు నాసికయందు శుభం, హనుప్రదేశమున భీతి, భ్రూ మధ్యమమున కలహం, కంఠమున వ్యసనంమ వెన్నెముక యందు మోసం, వీపు కుడివైపు సుఖం, ఎడమవైపున రోగం, కుడిచేతి ఎడమచేతియొక్క

భుజశిరస్సున శత్రుభయం, మిగిలినచోట ధననాశనం, హృదయ మున గౌరవం, దక్షిణహస్తమున సౌభాగ్యం, వామహస్తమున కీర్తి, కుడిప్రక్క సుఖం, ఎడమప్రక్క పీడ, ఉదరమున ధాన్యలాభం, దీని కుడిప్రక్క పుత్రలబ్ధి, ఎడమప్రక్క శిశుపీడ, నాభియందు ఇష్టప్రాప్తి, పొత్తికడుపున గర్భస్రావం, గుహ్యమున మృత్యువు, గుదస్థలమున రోగం, దక్షిణకటి యందు వస్త్రలాభం, వామకటియందు దుఃఖం, కుడితొడ, కుడిమోకాలు, పిక్క వీనియందు సుఖం, ఎడమతొడ,ఎడమ మోకాలు, ఎడమపిక్కలయందు దుఃఖం, కుడిపిరుదున ధనవృద్ధి, ఎడమపిరుదున స్త్రీవియోగం, కుడిచీలమండయందు, ఎడమ చీలమండ యందుహాని,పాదములయందు ప్రయాణము. ***పురుషుల కుడి భాగమందలి ఫలం స్త్రీలకు ఎడమభాగమందగును.***

**7. తారాబలము చూచుక్రమము:**

జన్మనక్షత్రము మొదలు నిత్య నక్షత్రమువరకు లెక్కించి తొమ్మిదిచే భాగించగా శేషము 1జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార,5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమ మిత్రతార యనియు తెలియవలెను. 1,3,5,7 తారలు మంచివి కావు, మిగిలినవి మంచివి.

**8. మాస ఫలము:**

శుక్ల ప్రతిపదాది నక్షత్రం మొదలు తన నక్షత్రం వరకు లెక్కించి తొమ్మిదిచే భాగించగాశేషం1వచ్చిన ఫలితం-ప్రవాసం,2 సుభోజనం, 3 తనుతాపం, 4 సౌఖ్యం, 5 విద్యావృద్ధి, 6 లక్ష్మీప్రదం, 7 శోకం, 8 ధనలాభం, 9 సమస్త శుభఫలం కలుగును.

**4.9 ప్రయాణయోగ్యతిథివార నక్షత్రములు :** 2,3,5,7,10,11 ఈతిథులు,శుక్లత్రయోదశియు, కృష్ణప్రతిపత్తు,సోమ,బుధ, గురు, శుక్రవారములున్ను,అశ్విని,రోహిణి,మృగ,పున,పుష్య ఉత్తరా త్రయం,హస్త,అనూరాధ,మూల,శ్రవణ,ధనిష్ఠ, శతతార, రేవతి నక్షత్రములున్ను మేష, వృషభ,కర్కాటక,తుల ధనుర్మకర, మీన లగ్నములున్ను యోగ్యములయినవి.

**4.10 వారశూల :** తూర్పునకుశని,సోమవారములును; ఆగ్నేయమునకు గురు,శనివారములు; దక్షిణమునకు గురు వారము;నైరుతికి సోమ,శుక్రవారములు; పశ్చిమమునకు ఆది, శుక్రవారములు; వాయవ్యమునకు ఆది,మంగళ వారములు; ఉత్తరమునకు మంగళ,బుధవారములు; ఈశాన్యమునకు బుధ వారము శూలలుగనుక, ఈవారము లందు ఈదిక్కులకు ప్రయా ణముచేయకూడదు. ఐతే ప్రయాణముచేయుట తప్పని అవస్థ వచ్చినప్పుడు ఆయా దిక్కులకు ఆది,గురు, శుక్రవారముల యందురాత్రులు దోషములేదు.సోమ, మంగళ, శనివారము లందు పగలుదోషము లేదు. బుధవారము రాత్రింబగళ్ళు రెండునుదుష్టములే.

**4.11 ఔషధమును తీసుకొనుట:** శుభవారములుఆది, మంగళ, గురు,శుక్రవారములు శుభనక్షత్రములుఅశ్వి,మృగ,పున, పుష్య, హస్త,చిత్త,స్వాతి,అనూ,మూల,శ్రవణ,ధనిష్ఠ,శతతార,రేవతులు.

**4.12 గృహమునందు 'పేరటి'లో అరటిగెల (మొదటిసారి) వేసినందుకు ఫలము:**

తూర్పున శుభము, ఆగ్నేయమున శత్రువృద్ధి, దక్షిణమున బంధునాశనము, నైరృతిలో పుత్రసంతాన లాభము, పడమరలో ఆపదలు,వాయవ్యమున అనారోగ్యము, ఉత్తరమున ధన లాభము, ఈశాన్యమున కీర్తిలాభము కలుగును. ఇట్లే కొబ్బరి, ఖర్జూర, పూలమొక్కలు మొ॥లైన వృక్షముల విషయమును గూడ తెలుసు కొనవలెను.

**4.13 గృహమునందు పిడుగుపడుట :**

గృహమందెక్కడ పిడుగుపడినను యజమానికిహాని, ఆవరణ మందు అనుచరులకు, దేవాలయమునందు పిడుగు పడినచో ధర్మకర్తకు,పూజారికి హాని కలుగును. దోషపరిహారమునకు యథావిధిగా శాస్త్రోక్తశాంతిని జరుపుకోవలెను.

**4.14 గృహమందు పుట్టలుపెట్టినందుకు ఫలము :**

ఇంటిమధ్యలో పుట్టపెట్టిన భార్యకుహాని, తూర్పున యజ మానికి, ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైరుతిలో ధనహాని, పడమరలో పూజ్యత, వాయవ్యమున మిత్ర దర్శనము,ఉత్తరమున పశునాశనము,ఈశాన్యమున ధనలాభము కలుగును. అశుభస్థానములందు పుట్టలేచినచో శాస్త్రోక్త శాంతిని చేయవలెను.

## 5. ఉపనయన, వివాహ విషయములకు చూడవలసిన అంశములు

**5.1 ఏకోదరుల కుపనయన వివాహములు :** ఏకోదరులగు ఇద్దరు కుమారులకు ఒక సంవత్సరమున ఉపనయనముగాని, వివాహములుగాని చేయరాదు. కుమారునకు ఉపనయనము, కుమార్తెకు వివాహము చేయవచ్చును. కాని కుమార్తె పెండ్లికంటె కుమారుని ఉపనయనము ముందు చేయవలెను. ఒక కుమారు నకు ఒకకుమార్తెకు ఒకసంవత్సరములో పెండ్లిచేయ వచ్చును. అయితే కూతురుపెండ్లిమాత్రం ముందు చేయవలెను. ఇద్దరు కొడుకులకు, నొకసంవత్సరమునందు ఉపనయన, వివాహాలు చేయరాదు. తక్కిన కార్యములు చేయవచ్చును. కవలపిల్లలగు స్త్రీ,పురుషులకు మాత్రము జ్యేష్ఠా క్రమముగ ఒకసంవత్సరమందే చౌలఉపనయన, వివాహమొ॥లగుశుభకార్యములు చేయవచ్చును. (వీరికినిషేధములేదనిభావము)

**5.2 ఉపనయనకర్తలు :** ఉపనయనమును చేయుటకు తండ్రి ముఖ్యుడు. అతడు లేనప్పుడు వరుసగా పితామహుడు. పెద తండ్రి, పినతండ్రులు, ఉపనీతులగు భ్రాతలు, పినతాత, పెద తాతలు, సపిండులు,సగోత్రులు,గురువులు వీరధికారులు. ఉపన యన మధ్య,తల్లి బహిష్ఠయగుట, ఉపనయనమున వటువు బ్రహ్మ చారులతో భోజనంచేయుటకు పూర్వం, తల్లి బహిష్ఠ అయినచో ఉపనయనము పనికిరాదు, మరలజేయవలెను. భోజనము అయినపిదప అయినచో బాధలేదు. ఐతే వటుడు కన్నకొడుకుగాక ఇతరులెవరైనను (తమ్ముడైనను) తనభార్య ఎప్పుడు బహిష్ఠ అయినను ఉపనయనము మాన నక్కరలేదు.

**5.3 వివాహవిషయమై కూటములు :** వివాహ పూర్వం వధూ వరుల జాతకములందు ముఖ్యముగా గణవశ్యవర్ణయోని కూటము

లను చూడవలయును. ఇందు గణకూటం క్షత్రియులకు, వశ్యకూటం వైశ్యులకు, యోనికూటం శూద్రులకు, గ్రహమైత్రి బ్రాహ్మణులకు ముఖ్యం. నాడికూటం, రాశికూటం, రజ్జుకూటం, తారాకూటం, ఇవి అందరకూ ముఖ్యమే, విషమ సమసప్తకం, షష్ఠాష్టకం, ద్విర్ద్వా దశం ఇవి చూచిన పిమ్మట స్త్రీ-పురుషులకు కూటములు ఏర్పడిన ఎడలనే వారలకు పరిణయం నిశ్చయించవలెను.

**5.4 గణకూటము :** అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, స్వాతి, అనూ, శ్రవ, రేవతి, ఇవి దేవగణములు. భరణి,రోహిణి,ఆర్ద్ర,పుబ్బ, ఉత్తర, పూర్వాషాఢ,ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర ఇవి మనుష్యగణములు. కృత్తిక, ఆశ్లేష, మఘ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం రాక్షసగణములు.

సమగణముప్రశస్తము. మనుష్య-దేవగణములు మధ్యమము, (కొందరి మతములో ఇదియు ప్రశస్తమే). దేవ-రాక్షసగణములు దోషప్రదము. మనుష్య-రాక్షసగణములు మృతిప్రదములు. పురుషరాక్షసము మంచిదని కొందరి మతము.

**5.5 వశ్యవర్గము :** కన్యకు మకరం, కుంభమునకు కర్కాటకము. తులకు సింహము, సింహమునకు వృశ్చికము, వదిలిపెట్టి మిగిలిన అన్నిరాశులు వశ్యములు. ధనురుత్తరార్థమునకు మీనమును విడిచిపెట్టి మిగిలిన అన్నిరాశులు వశ్యములు.

**5.6 గ్రహమైత్రి :** మిత్రరాశులందు జన్మించినవారికి వివాహ మొనర్చవలయును. చంద్రస్థితరాశ్యాధిపతుల మిత్రత్వమునే తీసుకొన వలెను. ఇద్దరి రాశ్యాధిపతులు ఒకే గ్రహమైనచో మంచిది. శత్రువు లయినచో శత్రుత్వ మేర్పడును. వధూవరుల రాశులు 3-11,4-10,7-1 అయిన ఎడల శత్రురాశులైనను శుభమే. శత్రు షష్ఠాష్టకం ప్రాణోప ద్రవకరము. విషమరాశి సమసప్తకము కూడదు.

**5.7 యోని కూటము :** 1.అశ్విని,శతతారలు-గుఱ్ఱములు; 2. భరణి రేవతులు-ఏనుగులు;3. కృత్తిక,పుష్యములు-మేకలు; 4. రోహిణి, మృగశీర్షలు-పాములు; 5. స్వాతి, హస్తలు - మహీషములు; 6. విశాఖ, చిత్తలు-పెద్దపులులు; 7. అనూరాధా,జ్యేష్ఠలు-లేళ్ళు;8. ఆర్ద్ర,మూలలు-కుక్కలు; 9. ఆశ్లేషా, పునర్వసులు-పిల్లులు; 10. మఖ,పుబ్బలు-ఎలుకలు; 11. ఉత్తర,ఉత్తరాభాద్రలు-ఆవులు; 12. పూర్వాషాఢ,శ్రవణములు-కోతులు; 13. పూర్వాభాద్ర,ధనిష్ఠలు-సింహములు; 14. ఉత్తరాషాఢ,అభిజిత్తులు-ముంగిసలు.

**5.8 విరోధ జంతువులు :** 1 లేళ్ళు-కుక్కలు; 2. పాములు-ముంగిసలు; 3. సింహములు-ఏనుగులు; 4. ఆవులు-పెద్దపులులు; 5. కోతులు-మేకలు; 6.ఎలుకలు-పిల్లులు; 7.గుఱ్ఱములు-ఏనుబోతులు;విరోధ జంతువుల సౌజ్ఞ కలిగిన నక్షత్రములు పనికిరావు.

**5.9 త్రిజ్యేష్ఠ :** జ్యేష్ఠులగు వధూవరులకు జ్యేష్ఠమాసములో పెండ్లి చేయరాదు. ఇక్కడ జ్యేష్ఠులనగా తొలిచూలు పిల్లలని అర్థము. వధువు కంటే వరునికంటే గాని ముందు ఒకరుగాని చాలా మందిగాని పుట్టినవారు చనిపోయినచో ఆ చనిపోయినవారు ప్రథములే జ్యేష్ఠులగుదురు. కాని బ్రతికియున్న వారినిబట్టి మాత్రము జ్యేష్ఠనిర్ణయము చేయరాదు. జన్మ క్రమము విడిచి స్త్రీలలో స్త్రీ జ్యేష్ఠురాలనియు, పురుషులలో పురుషుడు జ్యేష్ఠుడనియు అక్కడక్కడ కొందరు వ్యవహరించుచున్నారు. ప్రథమగర్భమున జన్మించినవారే జ్యేష్ఠులు. వధూవరులిరువురు జ్యేష్ఠులై జ్యేష్ఠమాసములో పెళ్ళియైనచో అదిత్రిజేష్ఠ అగును. వధూవరులలో ఒకరు మాత్రము జ్యేష్ఠులై వారిలో నొకరిది జ్యేష్ఠానక్షత్రమై జ్యేష్టమాసములో పెళ్ళియైనయెడల నదియు త్రిజ్యేష్ఠయే నగును. వధూవరు లిరువురు జ్యేష్ఠులు కాకున్నను వారిద్దరి నక్షత్రములు జ్యేష్ఠలై జ్యేష్ఠమాసములో పెండ్లిఅయినచో త్రిజ్యేష్ఠ అగును. ఏవిధముగా చూచినను ఇట్లు మూడుగాని, నాలుగుగాని, ఐదుగాని జ్యేష్ఠలు సంభవించ కూడదు. కేవలము నింద్యములు.

**5.10 స్త్రీ పురుషుల వివాహ విషయమున వారికన్యోన్య ప్రీతి యున్నదీ లేనిది తెలుసు కొనుటకు వారి జన్మలేక నామ నక్షత్రములకు ఈ క్రింది విషయములను చూడవలెను:**

వర్గములు మొత్తం 20 కలవు. వీనిలో 1 నాడీకూటము, 2 రాశి వర్గము, 3 గ్రహమైత్రి, 4 యోనికూటము, 5 స్త్రీ దీర్ఘము, 6 గణకూటము ఇవి మిక్కిలి ముఖ్యములు. మహేంద్ర గణిత వర్గములు, అయ,వశ్యవర్గములు, దినవర్గము, జాతివర్గము, వేధాకూటము, పక్షిరజ్జు వర్గములు, యోగినీ,లింగభూత వర్గములు,చంద్రయోగము, గోత్రవర్గము ఈ 14 వర్గములు మధ్యమములు. మొత్తం ఇరువది వర్గములు.

ముహూర్త చింతామణిలో 1 వర్ణము 2 వశ్యము 3 తార 4 యోని 5 గ్రహమైత్రి 6 గణము 7 రాశికూటము 8 నాడీకూటము. ఇవి ముఖ్యములనియు వరుసగా గుణాధిక్యము గలవనియు తెలిపి నారు. అనగా 1 వర్ణమునకు 1గుణం; 2 వశ్యమునకు 2 గుణములు; 3 తారలకు 3 గుణములు; 4 యోనికూటమునకు 4 గుణములు; 5 గ్రహమైత్రికి 5 గుణములు; 6 గణమైత్రికి 6 గుణములు; 7 భకూటము నకు 7 గుణాలు; 8 నాడీ కూటమునకు 8 గుణాలు గలవు. ఇవి మొత్తం 36 గుణములు.

వధూనక్షత్రమునుండి గణన చేయగా వరనక్షత్రము 8 కూటము లందు మైత్రీభావమును అంగీకారమును పొందినచో మొత్తం 36 గుణములు వచ్చును.

యీ కూటములు ఎన్నికుదిరినవి చూచుకొని వాని గుణములు లెక్కించుకొనగా 18 గుణములుకంటె ఎక్కువ వచ్చినచో మంచిది. తక్కువ వచ్చినచో వధూవరుల నక్షత్రములకు అన్యోన్యతలేదని భావము. ఎక్కువ గుణములు వచ్చినను వారిజాతకములందు చతుర్థ, సప్తమ, అష్టమ భావములందు సంపూర్ణ శుభత్వము గలిగినప్పుడు వివాహము చేయవచ్చును. మరి కొందరు ప్రాచీనులు వివాహానుకూల విచారణ చేయుటలో 1. రాశి, 2. రాశ్యాధిపతి 3. వశ్యము, 4. మహేంద్రము, 5. గుణము 6. యోని 7. దినములు 8. స్త్రీ దీర్ఘము అను 8 కూటములను విచారించవలెనని తెలిపి యున్నారు.

కాలప్రకాశికయను గ్రంథమందు 1 దినము 2 గణము 3 మహేన్ద్రము 4 స్త్రీ దీర్ఘము 5 యోని 6 రాశి 7 రాశ్యాధిపతి 8 వశ్యము 9 రజ్జువు 10 వేధయను 10 కూటములను విచారించ వలెనని యున్నది.

**5.11 ఏక నక్షత్ర విషయము :** రోహిణి, ఆర్ద్ర, మఘ, హస్త, విశాఖ శ్రవణ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు స్త్రీ పురుషులకు ఒకటియైనను శుభప్రదము.

అశ్విని, కృత్తిక, మృగశిర, పునర్వసు, పుష్య, పుబ్బ, ఉత్తర, చిత్త, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢలు స్త్రీ పురుషులకు ఒకటియైనచో మధ్య ఫలప్రదము నింద్యము గాదు.

భరణి, ఆశ్లేష, స్వాతి, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం, పూర్వా భాద్రలు స్త్రీ పురుషులకు ఒకటియైనచో వివాహము చేయరాదు.

రెండు రాశులకు సంబంధముగల ఒక నక్షత్రము నందు స్త్రీ పురుషులు జన్మించినప్పుడు వారిలో మొదట పురుష రాశి తరువాత స్త్రీరాశి అయినచో మేలు కలుగును. (ఉ:-కృత్తిక 1వ పాదంలో

పురుష జన్మకు మేషరాశి, కృత్తిక 2 పాదమందు స్త్రీ జన్మకు వృషభరాశి యగును. మొదట పురుషరాశి, తరువాత స్త్రీరాశి యగును. (స్త్రీరాశి నుండి పురుష రాశి 12వ రాశి యగుటచేత శుభము నిచ్చును.)

భిన్న నక్షత్రములందు ఏకరాశియందు జన్మించిన వారైనచో మొదట పురుష నక్షత్రం అయినచో మంచిది. స్త్రీ నక్షత్రం అయినచో చెడుఫలం నిచ్చును. ఏకరాశియందు జన్మించి భరణి, కృత్తిక,పుష్యమి ఆశ్రేష,ధనిష్ఠ,శతభిషములందు జన్మించినచో పనికిరాదు.

**5.12 నైధనతార విషయమై ప్రత్యేక వివరణ:**

**స్త్రీ నుండి 1వసారి నైధనతార :** 1. కృత్తిక–ఆశ్రేష; 2. ఆశ్రేష–స్వాతి; 3. చిత్త–పూర్వాషాఢ; 4. అనూరాధ–ధనిష్ఠ; 5. ధనిష్ఠ–భరణి; 6. శతతార–కృత్తిక. ఈ నక్షత్ర ద్వయమందు జన్మించిన స్త్రీ పురుషులకు వివాహము చేయరాదు. వీనిలో మొదటిది స్త్రీ జన్మనక్షత్ర ముగా గ్రహింపవలయును.

**విశేషము:** 1. ఆర్ద్ర–ఉత్తర; 2. పుబ్బ–అనూరాధ; 3. పుష్యమి–చిత్ర 4. పునర్వసు–హస్త ఈ నక్షత్ర ద్వయమునకు వివాహము చేయ వచ్చును. 1వసారి నైధనతార వీనికి మంచిది.

జ్యేష్ఠ శతతారలకు వివాహము చేయుట మంచిది కాదు. అది కుటుంబహాని నిచ్చును. మృగశిర–ఉత్తరాభాద్ర; హస్త–మూలలు ఈ నక్షత్ర ద్వయమునకు వివాహము చేసినచో ప్రాణభీతి సంపదలు నశించుట జరుగును.

రోహిణి–మఘలు, పూర్వాభాద్ర–రోహిణిలు, అశ్వినీ–పునర్వసులు, స్వాతీ–ఉత్తరాషాఢలు ఈ నక్షత్రములకు వివాహము చేయదగును. రేవతీ–ఆర్ద్రలు, జ్యేష్ఠ–ఉత్తరలు మధ్యమములు.

విశాఖ–మఘలు, విశాఖ–శ్రవణములు, ఉత్తరాభాద్ర–మృగశిరలు వైధవ్యమును ఇచ్చును.ఉత్తరాషాఢ రేవతులు ప్రీతి నిచ్చును. మూలా–పూర్వాభాద్రలు అభివృద్ధినిచ్చును. పూర్వాషాఢ–ఉత్తరాభాద్రలు అన్యోన్యానురాగము నిచ్చును. పైన వివరించిన నక్షత్రములలో మొదటి నక్షత్రము పురుషనక్షత్రము. రెండవనక్షత్రము స్త్రీనక్షత్రము కావలయును. ఈ విచారణలో అష్ట లేక దశవిధ కూటములలో ఐదుకూటముల కంటె ఎక్కువ కూటములు కుదిరినచో అట్టి వధూవరులకు వివాహము చేయవచ్చును. ఈ ఐదు కూటము లలోను నాడీ, రాశి, గణ, దిన, యోనికూటములు ముఖ్యమనిగమ నించవలెను మరియు బహు సమ్మతము.

దినకూటము అదృష్టమును, గణము సంపదలను యోని కూటము మొత్తం సంతానమును, రాశికూటము పరస్పర మైత్రిని, నాడీకూటం శరీర సుఖమును కలిగించును. ఇందు విశేషము లింకను ముహూర్త గ్రంథములందు వివరింపబడి యున్నవి.

**5.13 వావి–వరసలు చూచునప్పుడు వరునిబట్టి చూడవలయునుగాని, వధువునుబట్టి చూడకూడదు :**

బంధువర్గములలో తల్లి, సోదరి, కూతురు ఈమూడు వావు(వరస)లు పనికిరావు. 1.మేనత్తకుమార్తెను 2.ఆమె కుమార్తెను 3.సవతితల్లి చెల్లెలిని 4.ఆమె పుత్రికను 5. మేన మామ భార్య చెల్లిలిని 6.పినతండ్రిభార్య చెల్లెలి కూతురును 7. అన్నదమ్ముల కుమార్తెల కుమార్తెలను 8.భార్య చెల్లెలిని 9. ఆమె పుత్రికను 10.అన్నభార్య చెల్లెలును 11.ఆమె పుత్రికను 12.తానుదత్తుడైనయెడల జనకసోదరి పుత్రికను 13. దత్తతసోదరి పుత్రికను 14.మేనమామకూతురును 15. మేన మామ కుమారుని కుమార్తెను 16.గురునకు వాగ్దత్త అయినస్త్రీని 17.గురుపుత్రికను 18.భార్య పినతల్లిని 19. పినతల్లి కుమారుని కుమార్తెను 20. పినతల్లి సవతియొక్క సోదరిని 21.పినతండ్రి మరదలి సవతి కూతురును 22. పినతండ్రి భార్య సవతియొక్క చెల్లిలికూతురును 23. పినతండ్రి భార్య చెల్లెలి సవతికూతురును 24.తన వితంతుకోడలి సవితి చెల్లెలిని 25.తల్లి మేనమామ కోడలి చెల్లెలిని 26.సవతి నాయనమ్మ అన్నదమ్ముల కూతురును 27. మేనమామ కోడలి చెల్లెలిని 28.మేనత్త చెల్లెలిని పెండ్లి ఆడరాదు.

**5.14 కన్యాదానము చేయుటకధికారులు :**

1. తండ్రి 2. పితామహుడు (తండ్రి తండ్రి) 3. సోదరుడు 4. పితృకులములో ముఖ్యులు(పెదతండ్రి, పినతండ్రి మొ॥గు వారు). మేనమామకులములో మాతామహుడు(తల్లితండ్రి), మేన మామ, పైనక్రమముగ తండ్రినుంచి ఒక్కొక్కరు లేనిచో తరువాత వారు అధికారులగుదురు. పైన తెలిపినవారెవ్వరు లేని యెడల తల్లి కూడ చేయవచ్చును. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో ఉపనయనమైన సోదరులకుమాత్రమే అధికారముండును. ఉపనయనము కాని సోదరులు చేయకూడదు. ఉపనయనము కాని సోదరులు, తల్లిమాత్రమే యున్నయెడల తల్లి కన్యాదానమును చేయవచ్చు ననియు కలదు. తల్లి లేకుండ ఉపనయనముకాని సోదరులు మాత్రమే యుండి పైన చెప్పిన అధికారులెవ్వరుకూడ లేనియెడల తమ బంధువులలో నెవరైన గాని, తమకులములోని వారెవ్వరైనను కూడ కన్యాదానము చేయవచ్చును. ("భ్రాతావానుమతే పితుః" అను నారదమహర్షి వచనమునుబట్టి తండ్రియొక్క అనుమతితో సోదరులు చేయవచ్చునని ధర్మసింధు టిప్పణిలో కలదు.)

**విశేషము :** ఇతరుల కన్యకు కన్యాదానమును చేసే యెడల కన్యయొక్క తల్లిదండ్రులకు సువర్ణాదులనిచ్చి కన్యను తన కన్యగా చేసుకొని ధర్మపద్ధతిని వివాహమును చేయవచ్చును. సగోత్రులు కాకపోయినను కూడ కన్యాదానమును చేయవచ్చును.

**5.15 వివాహమునకు ప్రతికూల విషయము :** వివాహము నిశ్చయించిన పిమ్మట వరునియొక్క లేక కన్య యొక్క సగోత్ర త్రిపురుషరూపమైన తన కులమందు ఎవరైనా మరణించినచో ప్రతికూల దోషమందురు. అనగా వివాహమును చేయకూడదనుట. వివాహ నిశ్చయము వాగ్దానము అని ఒకటి. లగ్నాదుల నిశ్చయమై కట్నకానుకలను నిశ్చయించి తాంబూలములను తీసుకొనుట యనునది రెండవది.

**5.16 సగోత్ర త్రిపూరుషమనగా :**

**5.16.1** వరునియొక్క ప్రథమ భార్య, వరుని తల్లి దండ్రులు, పితామహుడు, పితామహి, వివాహముకాని తండ్రిసోదరి (మేనత్త), వీరు పూర్వత్రిపూరుషమనబడును.

**5.16.2** వరుని–సోదరుడు, భార్య, పుత్రులు, వరుని వివాహము కానిసోదరి, వరునికోడలు,పుత్రులు, వివాహము కాని కుమార్తె, పౌత్రుడు(కొడుకునకు కొడుకు), పౌత్రుని భార్య, వివాహముకాని పౌత్రి. ఇది పర త్రిపూరుష మనబడును.

**5.16.3** పినతండ్రి, పెదతండ్రులు, వారిభార్యలు వారి కుమా రులు, కోడళ్ళు, వివాహముకాని కూతురు, సంతాన భేదమందు సగోత్ర త్రిపూరుష పురుషగణనము, పురుష విషయములో గ్రహించ తగినది.

పైన వ్రాసిన వారిలో ఎవరు మరణించినను వివాహమునకు ప్రతికూల మనబడును. ఇక్కడ సోదరుడు పుత్రుడు, పౌత్రుడు వీరలకుపనయనము కాకపోయినను, 3 సంllలు దాటినను, 3సంllరాలు దాటి వివాహముకాని సోదరి యైనను లెక్కలోనికి తీసుకొనవలెను. (3సంllరాల లోపు చనిపోయినచో లెక్కలోనికి తీసుకోనవసరంలేదు.) ఇదే విధముగ కన్యయొక్క కులమందు గూడ తెలుసుకొనవలెను. కన్యయొక్క తల్లిదండ్రులు, పితా మహుడు, పితామహి ఇత్యాదులను గ్రహించవలెను. ఈవిషయ మును వివాహోపనయనము లందు త్రిపూరుష గణనను ఊహించుకొనవలెను.

**5.17 ప్రతికూలమందువిశేషము:** తండ్రి, తల్లి, పితా మహుడు, పితామహి,పినతండ్రి,పెదతండ్రులు, ప్రథమభార్య, ప్రథమభార్య కుమారుడు,సోదరులు, వివాహముకాని సోదరి వీరలయొక్క మరణము సంభవించినపుడు విశేషదోషముండుట చేత వివాహమును చేయకూడదు. ఈవ్రాసిన వారి కంటే భిన్నులైన త్రిపూరుష సపిండులయొక్క మరణము కలిగినచో శాంతి జరిపించి దోషమును పోగొట్టుకొని వివాహమును చేయ వచ్చును. ఇది సాధారణ పరిస్థితులందు గ్రహించవలెను.

**5.18 వివాహనిశ్చియానంతరము సంకటపరిస్థితులలో:** తండ్రి మొllగువారు చనిపోయినచో వారి వారి మరణ సమయములనుండి ఆగవలసినంతకాలముఆగి, తరువాత శాంతిని జరిపించుకొని దోషమును పరిహరించి వివాహమును చేయవచ్చును. అందులో మరియొక విషయమేమనగా వివా హము నిశ్చయమైన పిమ్మట తల్లిదండ్రులిద్దరు చనిపోయినచో కాలప్రతీక్షశాంతుల వలనగూడ దోషము పోదు, కావున సంవత్స రముదాటిన తరువాతనే వివాహము చేయవలెను. ఒకవేళ తల్లిగాని, తండ్రిగాని యెవరో ఒకరు మాత్రమే చనిపోయినచో కాలప్రతీక్ష శాంతులవలన దోషమును పోగొట్టు కొని వివాహము చేయవచ్చును. సంకటపరిస్థితు లేర్పడినప్పుడు వివాహం నిశ్చయమైనపిదప తండ్రి చనిపోయినచో 1సంllరము, తల్లికి 6మాసములు భార్యపోయినచో 3 మాసములు, సోదరులకు, పుత్రులకు 1 1/2 మాసము అశౌచకాలమని భావించవలెను. పైన వ్రాసిన వారి కంటే యితరులైన సపిండులకు 1నెలరోజులు పూర్తిఅయిన పిమ్మట శాంతినిజరుపుకొని వివాహలగ్నమును పెట్టుకొనవలెను.

సంకటము, అతిసంకటము, మహాసంకటమని బాధా కరమైన కాలమును మూడురకములుగ చెప్పినారు.

సాధారణస్థితియందు తండ్రి మరణించినచో ఒక సంllరము దాటినతరువాత వినాయకశాంతిని జరిపించి, వివాహమును జరుపవలెను. అతిసంకట పరిస్థితులెదురైనచో 6 మాసములు దాటిన పిమ్మట వినాయకశాంతిని,లక్ష్మీపూజను చేయవలెను.

**5.19 విశేషముగ చెప్పిన ముఖ్యవిషయము :**

వివాహ నిశ్చయమునకు పూర్వమందే మాతా పితరులలో నెవరు మరణించినను 1 సంllము వరకు వివాహమును చేయ రాదను వచనము ఏవిధమైన సంకటపరిస్థితులు లేనప్పుడు గ్రహించవలెను.

**5.20 ప్రతికూలమునకు అపవాద వచనములు :**

మాత్రాది మరణములందు అతిసంకటపరిస్థితులేర్పడి నప్పుడు నెలరోజులుకూడ ఆగుటకుఅవకాశములేని విషమ పరిస్థితులు కలిగినప్పుడు, 10రోజులు దాటిని తరువాత, కొద్ది రోజులు దాటించి నెలలోపుగకూడ వివాహమును జరిపించవచ్చును. వినాయకశాంతి, శ్రీపూజనము మరియు గోదానము విధిగ చేయవలెను. పైన వ్రాసిన విషయములను బాగుగ ఆలోచించి సంకట తారతమ్యముచే గ్రహించవలెను. సంకట స్థితి లేకపోయి నను అతిసంకటస్థితి వచ్చినదని చెప్పినచో అట్లుచెప్పినవారికి, చేసెడివారికిగూడ దోషము సంక్రమించును. దుర్భిక్షము,రాష్ట్ర భంగము మొllగు భయములు కలిగినను, తల్లి దండ్రులకు ప్రాణ సంకటస్థితివచ్చినను అతిసంకటస్థితిగా గ్రహించవలయును. దీర్ఘ వ్యాధిపీడితులై ప్రాణసందేహస్థితి కలిగి నప్పుడు,వధూవరులలో దూరదేశమునకు పోవలసిన అత్యవసర స్థితి కలిగినప్పుడు, ప్రౌఢకన్యల విషయములోప్రతికూల విషయములను చూడనవసర ములేదని కలదు. పైన వ్రాసిన విషయము లన్నియుధర్మసింధు వనుగ్రంధముననుసరించి వ్రాయబడినవి.

(ధ.సిం.చూ.ప్రతికూల విచారము, ప్రతికూలాపవాదము తృతీయ పరిచ్ఛేదము –పూర్వార్థము).

## 6. త్రివిధ నవమీ కాలము

**నవములు మూడువిధములు అవి :**

**6.1 ప్రత్యక్ష నవమీ** : అనగా నవమీతిథి.

**6.2 ప్రయాణనవమి :**

అనగా ప్రయాణదినమునుండి మరియు నక్షత్రమునుండి కాని తొమ్మిది యని కొందరిమతము.

**6.3 ప్రవేశనవమి :**

అనగా తాను చేరిన ప్రదేశమునుండి మరల తొమ్మిదవదిన మందుగాని, తొమ్మిదవనక్షత్రమునందు గాని తిరిగి ప్రయాణము చేయుటయని అర్థము. ఈ మూడు నవములందు ప్రయాణము చేయుట దోషము. ఈ విధముగ ప్రయాణము చేసినచో కష్టము లెదురగును. ఇవి సర్వదా విడువతగినవి.

## 7. త్రివిధ ప్రవేశకాలములు

**7.1 వధూప్రవేశము:** కొత్తగావివాహమైనస్త్రీ అత్త వారింటలో రాత్రిప్రవేశించవలెను. పగలుప్రవేశించకూడదు. పగలు ప్రవేశించి నచో అత్తవారికి,కన్యకుకూడా దోషము కలుగును.

**7.2 రాజప్రవేశము:** కొత్తగారాజ్యమందుప్రభువు పగటి యందు ప్రవేశించవలెను.రాత్రియందు ప్రవేశించరాదు. (ఈనాటి కాలములోగవర్నరు,ముఖ్యమంత్రులుమొ॥గువారికి వర్తింప చేయవచ్చును).రాత్రిప్రవేశము ప్రభువునకరిష్టము కలిగించును.

**7.3 నవగృహప్రవేశము :** రాత్రియందు, పగటియందు కూడ చేయవచ్చును.పగలు రెండుయామముల లోపున, రాత్రి భాగములో అర్థరాత్రి యందు, సంధ్యా కాలమందు ప్రవేశించకూడదు.

## 8. పురశ్శుక్రదోషము

గర్భిణీస్త్రీ, చంటిపిల్లతల్లి, నూతనవధువు,వీరు శుక్రుడు తూర్పులో నున్నప్పుడు పడమరనుండి వాయవ్య,ఉత్తర,ఈశాన్య, తూర్పుదిక్కులకు ప్రయాణంచేయరాదు.శుక్రుడుపడమరలో నున్న ప్పుడు తూర్పు,ఆగ్నేయ,దక్షిణ,నైర్రుతి,పరమరలకుప్రయాణం చేయ కూడదు. ఒకేగ్రామమునందు పురశ్శుక్రదోషములేదు. దుర్భిక్ష, రాజోపద్రవ, వివాహ, తీర్థయాత్రలలో ఈదోషము వర్తించదు.

## 8.1 శుభశకునములు

సువాసిని, వేశ్య, ఇద్దరుబ్రాహ్మణులు, దండమును ధరించిన శూద్రుడు,మంగళవాద్యములు,ఫలములు,పుష్పములు,ఛత్రముతో కూడినమనుష్యులు,చామరము,గుఱ్ఱము,ఏనుగు,పూర్ణజల కుంభము,చెరకు,అన్నము,పాలు,పెరుగు,మాంసము పొగలేని నిప్పు,ఉతికినబట్టలు, అక్షింతలు, వీణ, మద్దెల, ఘంటానాదము, శంఖము, వధూవరులు, జయశబ్దములు, శుభకరమైన వస్తువులు, ఎదురుగా వచ్చెడి చల్లనిగాలి, సంతోషమును, శరీర సుఖమునిచ్చెడి వెనుకనుండి వచ్చెడి గాలి, కోడి, కుక్క, నక్క, మొదలగునవి ఎడమనుండి పోవుట శుభఫలములను ఇచ్చును.

## 8.2 అశుభ శకునములు

ఒంటిబ్రాహ్మణుడు,భర్తలేనిఆడది,సన్యాసి,కర్రలమోపు,పాము, కొత్తకుండఖాళీగా ఉన్నది,నూనెపాత్రలు,ముష్టివాడు, కుంటికుక్క, ముక్కులేనివాడు,రోగి,గ్రుడ్డివాడు,కుంటివాడు,రజస్వల,ఒకతుమ్ము, సకిలించుట,వస్త్రములు మొ॥వి శరీరమునుండి జారిపడుట. చెడ్డమాటలు వినిపించుట, భుజించివెళ్ళమనుట,నేనుకూడ వచ్చె దననుట ఈ పూట వద్దనుట. ముఖ్య వస్తువులను మరచుట, వెతికినను దొరకకపోవుట, ఎదురదెబ్బ తగులుట మొదలగునవి అశుభశకునములు చెడ్డఫలితములనుఇచ్చును.కార్యవిఘ్నములు, అపాయములను సూచించును.

**8.3 ఉపశ్రుతి :** తన ప్రయాణ సమయమున ఇతరులు మంచి మాటలను మంచివార్తలను గురించి మాట్లాడినను లేక నీకు జయము, క్షేమము, ఆనందము, శుభము కలుగునని యున్నచో శుభమును కలిగించును.

**8.4 అపశ్రుతి :** తన ప్రయాణ సమయమున ఇతరులు దుర్వార్తల గురించి,మరణ,రోగ,బాధ,కష్టములను గురించి మాట్లాడిన, తనకు వ్యతిరేకముగనున్న మాటలను మాట్లాడినను చెడ్డఫలితములను ఇచ్చును.

**8.5 అశుభశకునాదులకు శాంతి :**

అశుభశకునములు వచ్చినప్పుడు మరల యింటిలోనికి వచ్చి కాళ్ళు, చేతులు,నేత్రములను కడుగుకొని మరల ప్రయా ణము చేయవలెను. 3పర్యాయములు దుష్టశకునము వచ్చిన యెడల ఆదినమున ప్రయాణమును విరమించవలెను.

## 8.6 సుస్వప్నములు (మంచి కలలు)

మేడలుఎక్కుట,పర్వతములెక్కుట,ఫలవృక్షములు, రథము, గుర్రము,ఏనుగులనుచూచుట,ఎక్కుట,ప్రభువు, బంగారు, రాగి,ఎద్దు,ఆవు,పండ్లు,పువ్వులు,ఆవుపాలు,దేవతా విగ్రహ ములు, గంధము,పుణ్యక్షేత్రములనుచూచుట,పాలు, పెరుగు, నెయ్యి, తేనె,ఇతరభక్ష్యములను మాత్రమేతినుట, పీతాంబరము లను ధరించుట,ఆభరణములనుధరించుట, జయముపొందుట, దేవుని పూజించుట, గురువులు గొప్పవారి దర్శనము, వాహన ములనెక్కుట మంచిస్వప్నములు.

## 8.7 దుస్వప్నములు (చెడ్డకలలు)

పాము,దున్నపోతు,గేదె,నూనె,ఆముదము,బురదలో దిగుట, సముద్రములోదిగుట,నదీస్నానముచేయుట (స్నానము చేయుట), వాహనమునుండిపడుట,మరణవార్త వినుట, పిచ్చిగా మాట్లాడుట, ఖైదుపడుట, వైద్యుని చూచుట, విధవనుచూచుట, క్షౌరమునుచేయించుకొనుట,ముండ్ల పొదలోపడుట, ఉరివేసు కొనుట, చేతిలోని ఫలపుష్పాదులను ఇతరులు లాగి కొనుట, తననుకొట్టుట, గాడిదను, దున్నపోతును ఎక్కుట, కాకిని చూచుట, పులి,సింహమువంటి క్రూరమృగములను చూచుట, వానిచేతరుమబడుట, పొగకని పించుట మొ॥గు దుష్టస్వప్న ములు చెడ్డఫలితముల నిచ్చును.

## 8.8అంగస్ఫురణము (అవయవములుఅదురుట)

శిరస్సున భూలాభము,లలాటమున స్థానవృద్ధి (భ్రూమధ్య), కనుబొమలమధ్య సహాయలాభము, నేత్రముల చివరిభాగమున ఇష్టప్రాప్తికి ఆలస్యము,కంటిపై భాగమున ధనలాభము, నేత్రముల క్రిందభాగమున యుద్ధమందు జయము, ముక్కు అదిరినప్రీతి–సుఖము, చెక్కిళ్ళలో స్త్రీ లాభము, చెవులవద్ద శుభవార్త, పెదిమలు ప్రీతిభోజనము, కంఠమందు భోగము, భుజములపైభాగమందుభోగవృద్ధి, భుజములందు మిత్ర లాభము, హస్తములందు ధనలాభము, వక్షస్థలమునందు జయము, స్తనములందు ఇష్టవస్తుప్రాప్తి హృదయమందు దుః ఖము, కడుపునందు ధనప్రాప్తి, నాభి యందు స్థాననష్టము, నాభికి క్రిందభాగమందు స్త్రీలాభము,ప్రక్కలందు ఆనందము,

వీపుయందు పరాజయము, కటియందు సంతోషము, కటికి క్రింద భాగమందు వాహనప్రాప్తి, మర్మాంగము నందు సంతాన ప్రాప్తి, తొడలవెనుకకష్టము,తొడల ముందు భాగమందు సహాయ లాభము,మోకాళ్ళయందు శత్రువులతోసంధి, పిక్కలందు నష్టము, పాదములందు స్థానలాభము, పాదాగ్రమందు లాభ ముతోకూడిన ప్రయాణము ఫలములు.

*అవయవములు అదురుట పురుషులకు కుడిభాగమందు, స్త్రీలకు ఎడమభాగమందు కలిగినచో మిక్కిలి శుభముల నిచ్చును. పురుషులకు ఎడమభాగమందు, స్త్రీలకు కుడిభాగ మందు అదిరినచో అశుభఫలముల నిచ్చును. అశుభ ఫలము లకు సువర్ణాదులను దానము చేయవలెను.*

## 9. గృహారంభ - ప్రవేశములకు చక్రశుద్ధులు

| వృషభచక్రము సూర్యుడున్న నక్షత్రము మొదలు కొనిఅభిజిత్తుతో లెక్కింపుడు | | కలశ చక్రముసూర్యుడున్న నక్షత్రముమొదలుకొని అభిజిత్‌ను మినహాయించి లెక్కింపుడు | |
|---|---|---|---|
| 1) 3 మృత్యువు | 5) 4 అర్ధలాభం | 1) 1 శిరచ్ఛేదం | 5) 4 నిర్ధనం |
| 2) 4 దుర్దశ | 6) 4 ధాన్యము | 2) 4 ప్రవాసం | 6) 4 గర్భస్రావం |
| 3) 4 స్థిరత్వము | 7) 3 సంపద | 3) 4 అభయం | 7) 3 సంపద |
| 4)3 భ్రమణము | 8) 3 పశువృద్ధి | 4) 4 ధాన్యం | 8) 3 శతాయువు |

**9.1 చెరకుఆడుటకుచక్రము :** చెఱకుగానుగలు ఆడుటకు చక్రశుద్ధి సూర్యనక్షత్రమునుండి దిననక్షత్రమువరకు లెక్కింపవలెను.

1వ పంక్తి 4 లాభము, 2 హాని, 2 అధికలాభము, 1 నష్టము,

2వ పంక్తి 5 ప్రాణభీతి, 5 శుభము, 2 దేహపీడ, 6 లాభము.

**9.2 హలచక్రము :** భూమిని దున్నుటకు సూర్యుడున్న నక్షత్రము నుండి దిననక్షత్రము వరకు లెక్కించవలెను.

1వ పంక్తి 3 నష్టము 3 శుభము 3 హాని 5 లాభము

2వ పంక్తి 3 నష్టము 5 లాభము 3 నష్టము 2 శుభము

**9.3 వాపీకూపాది చక్రము :** రోహిణినక్షత్రము నుండి క్రమముగ మధ్య3నక్షత్రములు,తూర్పున3న॥లు, ఆగ్నేయ మున2న॥లు,దక్షిణమున 3న॥లు, నైఋతి3న॥లు, పశ్చిమ మున3న॥లు, వాయవ్యమున3న॥లు, ఉత్తరమున 3న॥లు, ఈశాన్యమున 3 నక్షత్రముల నుంచవలెను. ఏ దినమున వాపీ కూపాది ఖననమును చేయుటకు ముహుర్తముంచబడునో ఆ దిననక్షత్రమును క్రిందవిధముగ గ్రహించవలయును. రోహిణి నుండి 3 శీఘ్రజలము, 3 నిర్జలము, 3 మధ్య జలము,2 జలా భావము, 3 అధిక జలము,3 మంచి జలము, 3 క్షార జలము, 3 అధిక జలము, 3 మధ్యమ జలము.

**9.4 స్తంభచక్రము :** గృహములకు, నూతులకు, చెరువులకు ఉపనయనములకు స్తంభప్రతిష్ఠ చేయునప్పుడు చూడవలయును. సూర్యుడున్న నక్షత్రమునుండి క్రమముగ దిననక్షత్రము వరకు అభిజిత్తుతో లెక్కించవలయును. 6 ప్రాణభీతి, 20 యశోవృద్ధి జయము, 2 ధనక్షయము.

**9.5 ద్వారచక్రము :** (గృహాదులకు ద్వారము నుంచునప్పుడు చూడతగినది) సూర్యుడున్న నక్షత్రమునుండి దిన నక్షత్రము వరకు లెక్కించవలయును. సూర్యనక్షత్రము నుండి 7 రాజప్రీతి, 8 రాజ్యలాభము, 8 ఉద్వాసనము, 2 ఐశ్వర్యము, 3 ప్రాణభీతి.

**9.6 ఘూర్ణాచక్రము :** (Oil Mill) నువ్వులు, కొబ్బరి, వేరుశెనగ, ఆవాలు మొదలగువాని నుండి నూనె తీయుటకు చూడవలయును. సూర్యుడున్న నక్షత్రమునుండి దిననక్షత్రము వరకు లెక్కించవలయును.

3 హాని, 3 వృద్ధి, 3 ఆరోగ్యము, 3 నాశము, 3 ధనలాభము, 3 రాజభీతి, 3 నిర్ధనత్వము, 3 ప్రాణ భయము, 3 సుఖము.

## 10. విశేషములు
## ముహూర్తములకు శుద్ధిస్థానములు

1.(1) వివాహమునకు సప్తమశుద్ధిముఖ్యము. 8వస్థాన మందు కుజుడు, చంద్రుడు, గురు, బుధ,శుక్రులు మంచివారు కారు (దోషాపవాదమున్నచో దోషములేదు). 2) ఉపనయనము నకు అష్టమశుద్ధి 3) గృహప్రవేశమునకు ద్వాదశశుద్ధి 4) యుద్ధమునకు ఏకాదశశుద్ధి 5) అన్నప్రాశనకు దశమశుద్ధి 6) చౌలమునకు నవమశుద్ధి 7) నూతన వస్త్రధారణకు షష్ఠశుద్ధి 8) ప్రయాణము నకు పంచమశుద్ధి 9) విద్యారంభమునకు చతుర్థశుద్ధి 10) ఔషధ సేవకు తృతీయశుద్ధి 11)నామకరణము నకు ద్వితీయశుద్ధి 12) సంగమమునకు (గర్భాదానమునకు) లగ్నశుద్ధి 13) గృహారంభము నకు చతుర్థాష్టమ (4+8) శుద్ధి ముఖ్యములు.

2. వివాహాదిసర్వముహూర్తములకు ఏకవింశతి మహాదోషము లుండకూడదు. వీనికి చెప్పబడిన అపవాదములున్నప్పుడు మాత్రమే ముహూర్తనిర్ణయము చేయవలయును. స్వల్ప దోష ములుగలిగి, గుణవత్తరమైన గ్రహబలమున్న లగ్నమును నిర్ణ యించవలయును.

3. ముహూర్తమును గురించి సత్యాచార్యుడు మొదలైనవారు ఇట్లనిరి. జ్యోతిశ్శాస్త్రము యొక్క సహాయముతో సుశిక్షితుడైన జ్యోతిర్వేత్తచే నిర్ణయించబడిన "ముహూర్తమందారంభింపబడిన క్రియలు శుభగ్రహములచేత జన్మాంతరార్జిత దుష్టఫలములను కూడా నశింపచేసి సర్వసంపదలను సుఖమును కలిగించునని ముహూర్తప్రశంసనుచేసియున్నారు.

సత్యాచార్యవచనము –

*శుభక్షణ క్రియారంభజనితాః పూర్వసంభవాః ।*
*సంపద స్సర్వలోకానాం జ్యోతిస్సత్ర ప్రయోజనమ్ ॥*

## 11. అశౌచ (మైల) విషయములు

**1. మృతి విషయమైదుష్ట తిథివార నక్షత్రములు :**

1,4,6,7,10,12,13,14,30 ఈ తిథులయందు, ఆది మంగళ, శుక్ర, శనివారములయందును, కృత్తిక,రోహిణి,మృగ, మఘ, ఉత్తర, చిత్త, విశాఖ, ఉ.షాఢ, ధనిష్ఠ, శత, పూ.భా, ఉ.భా, రేవతి నక్షత్రములయందు మృతిసంభవించిన యెడల గృహమునకు దోషము. కేవలము తిథివలన దోషములేదు. తిథి వలన స్వల్పదోషము. తిధి,నక్షత్రముల వలన అర్ధదోషము. వార, నక్షత్రములవలన త్రిపాదదోషము. తిధి, వార, నక్షత్రముల వలన సంపూర్ణదోషము.

**2. అశౌచ నిర్ణయము:** స్రావపాతా శౌచము : (1) గర్భాధారణాది మాసత్రయములోపుగా స్రావమగునేని తల్లికి మూడు దినములాశౌచము.(2) నాలుగవమాసమందు గర్భస్రావమగునేని తల్లికి నాలుగురోజులాశౌచము. తండ్రికి స్రావాశౌచంలేదు. స్నానంచేయవలెను.(3) నాలుగవమాసమందు ఈషత్కఠినస్రావమగునేని తండ్రికి మూడురోజులాశౌచం.(4) మృదుస్రావమగునేని స్నానంమాత్రమే. (5) మూడుమాసముల లోపుగా స్రావమగునేని జ్ఞాతులకుఅశౌచంలేదు. (6) చతుర్థమాసమున స్రావమగునేని జ్ఞాతులకు స్నానంతోశుద్ధి,సోదరులకు అశౌచం లేదు. (7) ఈషత్కఠినస్రావమందు స్నానంచేయవలెను. (8) 5వమాసంబున స్రావమగునేని 5రోజులున్ను, (9) 6వ మాసంబున పాతమగునేని 6 రోజులు - తల్లి గర్భపాతా శౌచం పట్టవలెను. తండ్రికి, సోదరులకు, జ్ఞాతులకు మూడురోజులు పురుడు, పాతాశౌచంస్నానంతోశుద్ధిఅగును. (10) 7వమాసంలగాయితు పూర్ణాశౌచం పట్టవలెను.

**3.** (1) ప్రాణంతో పుట్టి,బొడ్డుకోయుటకు పూర్వం మరణించినచో-తండ్రికి,అన్నదమ్ములకు,జ్ఞాతులకు మూడురాత్రులు పురుడు పట్టవలెను. మిగిలినవారికిమరణానంతరము స్నానంతో శుద్ధి. (2)మరణించి పుట్టినను లేక బొడ్డుకోసిన తరువాత 10 రాత్రులలోపుగా చనిపోయిననూ, అందరకి 10 రాత్రులు పురుడు మృతాశౌచం,స్నానంతో శుద్ధిఅగును. (3)10 రాత్రులు గతించిన పిదప దంతోత్పత్తిలోపుగా చనిపోయినఎడల జ్ఞాతులకు స్నానంతోశుద్ధి, తల్లిదండ్రులు 3 రాత్రులాశౌచం పట్టవలెను. (4) దంతోత్పత్తి మొదలు 3 ఏండ్లు లోపుగానైతే జ్ఞాతులకొక రాత్రి-పగలు అశౌచం, తల్లిదండ్రులకు 3 రాత్రులు. (5)4వ ఏడు మొదలు గర్భాష్టమసంవత్సరం లోపుగా చనిపోయినచో తల్లి దండ్రులకు, జ్ఞాతులకు 3రాత్రులాశౌచం.(6) అటుపైన ఉపనయనమైనను, కాకున్నను అందరకు పూర్ణాశౌచము.

**4.విశేషము:-**1. ప్రథమంగా ఒక అశౌచము జరిగి, ఆ అశౌచము యొక్క 10 రోజులలో, ద్వితీయఅశౌచముజరిగి, ఆద్వితీయాశౌచము ముందుగా తెలిసి, తరువాత ప్రథమాశౌచము తెలిసినచో, ద్వితీయాశౌచము కూడా ప్రథమాశౌచపు దినముల లోనే శుద్ధి అగును.

**5. మరియొక విశేషము :** మొదటి అశౌచం వచ్చియుండగా దాని 10వ రోజు సాయంకాలం కాకుండగ మరియొక పూర్ణాశౌచం తెలిసినచో పూర్ణాశౌచంతోనే శుద్ధిపదయవరోజు రాత్రి మొదటి జామునందు ద్వితీయాశౌచము తెలిసినచో ఆరోజుగాక 2 రోజులు పట్టవలెను. 10వరోజు తెల్లవారుఝామున తెలిసినచో పూర్వాశౌచము యొక్క పదునాలుగవ రోజున శుద్ధియగును.

**6. కన్యాశౌచము :**1.10రాత్రులుగతించినశిశువునుండి మూడేళ్ళుదాటినఆడపిల్ల మరణించినచో, జ్ఞాతులకుస్నానముతో శుద్ధి,తల్లిదండ్రులకు మూడురాత్రులాశౌచము. 2.నాలుగవ యేడు మొదలు, పెండ్లిఅయ్యేలోపునమరణించినచో, జ్ఞాతులకు ఒకరాత్రి, ఒకపగలుఅశౌచము.తల్లిదండ్రులకు3రాత్రులు అశౌచము.

**7. పక్షిణ్యాశౌచము :** మరణించుచున్న సమయమున దగ్గరున్న పక్షిణీదారులందరికీ మూడురాత్రులాశౌచము, దగ్గరలేని వారికి 10 రాత్రులలోపున ఎప్పుడుతెలిసినను ఒక రాత్రింబగలాశౌచము, 10వరోజు ఎప్పుడు తెలిసిననూ,తెలిసిన సమయానికి శుద్ధిస్నానం90 ఘ॥లు లేకున్ననూ శుద్ధి రోజుతోనే దగ్గరలేనివారికి కూడ పక్షిణిశుద్ధి పూర్తిఅగును.

**8. పక్షిణిదారులు పురుషులకు :** పినతల్లులు,పెదతల్లులు మేనమామలు, వారి భార్యలు, వారి సంతానము, మాతామహి, మాతామహుడు, మేనత్త, మేనత్త కుమార్తెలు, కుమార్తెల సంతానము, అక్కచెల్లెండ్రు, వారిభర్తలు, వారి సంతానము, భార్య తల్లిదండ్రులు, అన్నదమ్ములు.

**9. స్త్రీలకు :** పినతల్లులు,పెదతల్లులు, మేనమామలు, వారి భార్యలు, వారిసంతానము, మాతామహి, మాతామహుడు, పితామహి, పితామహుడు, తల్లిదండ్రులు, మేనత్త, పినతండ్రి, పెదతండ్రి, వారిసంతానము, అన్నదమ్ములు,వారిసంతానము, కుమార్తెలు, అల్లుడు, వారిసంతానము, అక్కచెల్లెండ్రు, వారి సంతానము. వీరికి పక్షిణిపట్టవలెను. ఉపనయనము కాని పురుషులకు, వివాహంగాని స్త్రీలవిషయములోను పక్షిణి పట్టనవసరము లేదు. స్నానముతో శుద్ధియగును. పినతండ్రి, పెదతండ్రి భార్యకున్ను, పినతల్లి,పెదతల్లి భర్తలకును, సాపత్నీ సోదరీసోదరులకున్ను, పక్షిణి పట్టనవసరంలేదు. స్నానముతో శుద్ధియగును.

(విశేషాంశములకు ధర్మసింధు మొదలగు గ్రంథములను చూడవలెను.)

**10. అశౌచాంతరిత ప్రత్యాబ్దికమునకు కాలము :**

ప్రత్యాబ్దికాదులకు జాతాశౌచముగాని,మృతాశౌచముగాని అడ్డువచ్చినచో, స్నానదినమునజరిగింపవలెను. ఆస్నానదినమున శూన్యతిథి అగునెడల ఆనాడు మానివేసి, మరునాడు ప్రత్యాబ్దికాదులు జరిగించవలెను. ఇట్లే సంవత్సర విమోచనమునకు ప్రథమాబ్దికములకును గూడ జాతశౌచమృతా శౌచములు అడ్డువచ్చునెడల. స్నానదినమున ముందుగాసంవత్సర విమోకమును, తరువాత ప్రథమాబ్దికమును జరిగించవలెను. స్నానదినమున శూన్యతిథియైన యెడల నాడుసంవత్సరవిమోకమును జరిపించి పరదినమున ప్రథమాబ్దికము జరిపించవలెను. సంవత్సర

విమోకమునకు శూన్యతిథిదోషములేదు. అశౌంచాతరితము కాన ప్పుడు, మృతతిథినాడు తిథిద్వయం సంభవించునెడల మృత తిథికి పూర్వదినమున సంవత్సర విమోకము జరిపించి మృత తిథినాడు ప్రథమ సాంవత్సరికమును జరిపించవలెను. సంవత్సర విమోకమునకు తిథిప్రధానముకాదు.

**11. పితామహశ్రాద్ధం :** పౌత్రుడు–పితామహి,పితా మహు లకు కర్మచేయవలసి వచ్చునప్పుడు దహనాది సపిండీకరణాం తము ద్వాదశమాసికములను, సంవత్సర విమోకమును, ప్రథమా బ్దికమును మాత్రం చేయవలెను. ద్వితీయాబ్దికము మొదలు ఆబ్దికములు పెట్టనక్కరలేదు.

**12. కర్తృనష్టశ్రాద్ధం :** పుత్రులులేని పినతండ్రి, పెదతండ్రు లకు, అన్నదమ్ములకు, వీరి భార్యలకును తాను ఆబ్దికాదులు జరిగించవలెను. తన తరువాత, తనకుమారులు జరిగించవలెను. అయితే తనకుమారులు, తన పినతండ్రి, పెదతండ్రులకు జరి గించ నక్కరలేదు. అనగా మూడవతరంవారి ఆబ్దికాదులు జరిగింప నక్కరలేదు.

**13. అధికమాసమృతున కాద్యశ్రాద్ధ నిర్ణయము :** అధికమాస మృతునకు అధికమాసమందే దహనాది, దశాహాంతమువరకు జరిపించి ఏకదశాహస్సునందు ఆద్యశ్రాద్ధమును, షోడశ శ్రాద్ధ మును ప్రకృతిగా జరిపించి, ద్వాదశాహస్సునందు సాపిండ్యము జరిగించవలెను. నిజమాసమృత తిథియందు, అన్వాద్య మాసిక మును సాధారణవిధిగ జరిపించి, నిజమాసమునందే మాస్యూనే చోన మానసికమితి శాస్త్ర విహితకాలములయందు ఊనమాసిక మును జరిపించవలెను. ద్వితీయ మాసికమును నిజమాసము నకు రెండవ మాసమందు జరిగించవలెను. ఏకదశాహస్సునందు షోడశ సంకల్పమునందు ద్వితీయానుమాసిక“ఆద్యాన్వాధ్యాభ్యాం సహాయుగపదద్యకరిష్యే” యని సంకల్పమును చెప్పవలెను. శేషము ప్రకృతిగ చేయవలెను.

**14. అధికమాస త్రైపక్షికాది నిర్ణయము :** మృతమాసము నకు ద్వితీయమాసము అధికమాసమయితే అధికమాసములో త్రైపక్షికమును జరిపించవలెను. ఆరవ మాసమధికమాసమైతే అధికమాసమందే ఊనషాణ్మాసికమును జరిగించవలెను.ద్వాదశ మధికమయితే అధికమాసమునందే ఉనాబ్దికమును జరిగించ వలెను. నిజమాసమందు త్రైపక్షికోన షాణ్మాసికో నాబ్దికములు జరిగించకూడదు.

**15. అధికమాసమందు ప్రథమాబ్దిక నిర్ణయములు :**

అధికమాసములేని సంవత్సరమునందు యొకానొక మాసము నందు మృతినొందిన వారికి తదగ్రిమ సంవత్సరము నందు ఆ మృత మాసమధికమైనచో నాయధికమాసము నందే ప్రథమాబ్దికమును జరిగించవలెను. నిజమాసమునందు మరల జరిగించకూడదు.

**16. అధికమాస మృతునకాబ్దిక నిర్ణయము :** అధికమాస మున మృతినొందినవారికి ఎప్పుడైనను ఆ మృతమాసమధిక మయిన యెడల నా యధికమాసమునందే ఆబ్దికము జరిగించ వలెను. నిజమాసమునందు జరిగించకూడదు.

**17. కర్మ చేయునప్పుడు :** పదునొకండవ దినమున కర్త భార్యగాని, ప్రేతభార్యగాని ముట్టు జరిగిన యెడల ఆద్యశ్రాద్ధము నకు వృషోత్సర్జనము, రుద్ర గణాఖ్యశ్రాద్ధము ఆద్యమాసికము వీనిని మాత్రము జరిగించవలెను. ఊనాది పంచదశైకోద్దిష్ట శ్రాద్ధ ములు శుద్ధిదినమున (స్నానదినమున) జరిగించవలెను. సపిండీ కరణము స్నానదినమునగాని మరునాడుగాని చేయవలెను. పండ్రెండ్రవ దినమున స్నానమయిన యెడల నాటి మధ్యాహ్న మున రెండవస్నానము చేయించి ఆద్యమాసికాదులను షోడశ శ్రాద్ధములను సపిండీకరణము చేయవలెను. పదమూడవ రోజు స్నానమయితే పండ్రెండవదినమునందే ఆద్యమాసికాది షోడశ శ్రాద్ధములు జరిగించి, పదమూడవదినమున సపిండీకరణ మును, ఊనమాసికమును చేయవలెను.

**18. తల్లిదండ్రులు మరణించిన సంవత్సరములో చేయ కూడనిపనులు :**తన తల్లిదండ్రులు మరణించిన సంవత్సరములో తనపుత్రులకు, పుత్రికలకు వివాహమును చేయరాదు. తన కుమారులలో ఎవరికైనను భార్యపోయినచో రెండవవివాహము చేయవచ్చును. తనకుగాని, తనసోదరులలో నెవరికిగాని ప్రథమ వివాహము చేయకూడదు. (కొందరు కన్యాదానము చేయవచ్చు నని చెప్పుచున్నారు. కాని ఇది సరియైనదికాదు). యజ్ఞాది క్రతువులనుచేయుట, చేయించుట, పౌరోహిత్యము, లక్ష హోమము, మహాదానాది కామ్యకర్మలు, తీర్థ యాత్ర,శివారాధన, ఉపవాసవ్రతములు,నూతనవ్రతా రంభములు, తీర్థశ్రాద్ధము, గయాశ్రాద్ధము చేయకూడదు. తన కుమార్తెకుగాని, కుమారునకు గాని వివాహము చేయవలసి నంత సంకటపరిస్థితిఏర్పడినచో శాస్త్రవిధిననుసరించి మాసికాదులను అపకర్షచేసి, ఆచరించి వినాయకశాంతిజరిపించి తరువాత వివాహములను చేయ వచ్చును.

**అశౌచములు 3 విధములు**

**1. రజస్వలా శౌచము :** ప్రథమ రజస్వలయందు 3 దిన ములు ఆ స్త్రీకి మాత్రము అశౌచముండును. నాల్గవ రోజు స్నానముచేత శుద్ధి అగును.పుణ్యాహవచనము చేసుకొని సువాసిను లకు తాంబూలం, వాయినము ఇచ్చుటచేత శుభముకల్గును. ప్రతీమాసము రజోదర్శనము పిమ్మట 3 రోజులు ఆ స్త్రీమాత్రమే అశౌచము పాటించవలసి వుండును.

**2. జాతా శౌచము :** శిశువు పుట్టుక (పురిటి) చేతను కల్గు అశౌచము. శిశువు పుట్టిననాటినుండి 10 రోజులు దేవాలయ దర్శనములు, విశేషపూజలు, పంక్తి భోజనములు మొ॥నవి నిషేధము.

**3. మృతాశౌచము :** ఎవరి మృతిచేతనైనా కలిగెడి అశౌచము (మైల)మృతాశౌచము అందురు. ఈ వివరములు పైన పేర్కొన బడినవి. ఏటి(సంవత్సర) శూతకముకలవారు నిత్య దీపారాధన చేసుకొనవచ్చును. విశేషమైన పూజలు, వేడుకలు చేసుకొనరాదు.

## ఏకవింశతి మహాదోషములు

1.పంచాంగశుద్ధి 2.సూర్యసంక్రమణము 3.లగ్నమునకు పాపషడ్వర్గము 4.భృగుషట్కము 5.కుజాష్టమము 6.గండాంతము 7.పాపకర్తరి 8.చంద్రునిషష్టాష్టమ,వ్యయస్థితి 9.సగ్రహచంద్రదోషము 10.దంపతులకు అష్టమలగ్నము 11.రాశి 12. విషఘటికలు 13.దుర్ముహూర్తము 14.వారదోషము 15.ఖర్జూరచక్రదోషము 16.గ్రహణోత్పాతదూషిత నక్షత్రము 17. క్రూర విద్ధనక్షత్రము 18.క్రూరసంయుతము 19.పాపనవాంశము 20.మహాపాతము 21.వైధృతి యని 21 దోషములు ముఖ్యమైనవి. వీనికి అపవాదములు ముహూర్తచింతామణి,కాలామృతము,జ్యోతిషరత్నమాలాది ముహూర్తగ్రంథములందు వసిష్ఠ-నారదాదిసంహితలందు వివరింపబడినవి.

## అమృతాది యోగములు

అమృతసిద్ధి=అసి, సిద్ధి= సి, అ=అరిష్టము, ఉ=ఉత్పాత, మ=మరణం, ప్రబలారిష్ట=ప్ర

| | అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త | స్వా | విశా | అనూ | జ్యే | మూ | పూషా | ఉషా | శ్రవ | ధని | శత | పూభా | ఉభా | రేవ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సి | ప్ర | అసి | సి | సి | సి | సి | సి | సి | మ | సి | అ | అ | సి | అసి | ఉ | మ | మ | అ | సి | అ | అ | మ | సి | సి | అ | అ |
| సోమ | సి | సి | మ | అ | అసి | సి | సి | అసి | సి | మ | సి | సి | సి | ప్ర | సి | మ | సి | సి | సి | ఉ | మ | అ | సి | సి | మ | సి | సి |
| మంగ | అసి | సి | అ | సి | మ | మ | సి | సి | సి | సి | సి | సి | సి | సి | సి | మ | అసి | ఉ | అసి | ప్ర | అ | అ | సి | మ | మ | అ | సి |
| బుధ | మ | సి | అ | సి | సి | సి | సి | సి | సి | సి | సి | అ | సి | సి | సి | సి | అసి | సి | సి | మ | అ | అసి | సి | ప్ర | అసి | అసి | ఉ |
| గురు | అ | సి | ఉ | మ | మ | అసి | అసి | అసి | అసి | మ | సి | సి | అ | అ | సి | సి | సి | ప్ర | అ | సి | సి | సి | మ | మ | సి | సి | సి |
| శుక్ర | అ | సి | మ | సి | మ | సి | సి | మ | మ | సి | సి | సి | సి | సి | సి | సి | మ | అ | ప్ర | అ | సి | మ | సి | సి | సి | సి | ఉ |
| శని | అ | అ | అ | సి | సి | సి | సి | మ | సి | సి | ఉ | మ | అ | అ | సి | సి | సి | సి | సి | సి | సి | సి | సి | మ | మ | ప్ర | అ |

| రాశి | ప్రమాణం | పుష్కర ప్ర॥ | రాశి | ప్రమాణ | పుష్కర ప్ర॥ | రాశి | ప్రమాణం | పుష్కర ప్ర॥ |
|---|---|---|---|---|---|---|---|---|
| మేషము | 4-20 ఘ॥వి | 3-02 | సింహము | 5-20 | 3-44 | ధనుస్సు | 5-19 | 3-41 |
| వృషభము | 4-56 | 2-18 | కన్య | 5-15 | 2-27 | మకరము | 4-43 | 2-12 |
| మిథునము | 5-26 | 4-21 | తుల | 5-24 | 4-19 | కుంభము | 4-11 | 3-21 |
| కర్కటకము | 5-31 | 1-17 | వృశ్చికము | 5-33 | 1-18 | మీనము | 4-02 | 0-56 |

### వివిధ పట్టణములకు దేశాంతర సంస్కార పట్టిక

| గ్రామము | మే-తు | వృ-క | మి-సి | కర్క | వృ-మీ | ధ.కుం | మకర |
|---|---|---|---|---|---|---|---|
| బరంపురం | +30విఘ | +34 | +38 | +40 | +25 | +20 | +20 |
| విజయనగరం | +16 | +13 | +20 | +21 | +14 | +12 | +10 |
| విజయవాడ | -12 | -13 | -14 | -14 | -11 | -10 | -10 |
| వరంగల్ | -24 | -22 | -23 | -22 | -25 | -25 | -6 |
| హైద్రాబాద్ | -32 | -31 | -31 | -30 | -33 | -28 | -4 |
| నెల్లూరు | -17 | -23 | -27 | -29 | -11 | -7 | -5 |
| కర్నూలు | -37 | -40 | -42 | -43 | -34 | -32 | -31 |
| అనంతపురం | -4 | -47 | -50 | -53 | -37 | -33 | -31 |
| మద్రాసు | -15 | -14 | +11 | +30 | +36 | +0 | +3 |
| బెంగుళూరు | -42 | -15 | -58 | -61 | -38 | -26 | -23 |

రాజమండ్రి నుండి ఆయా పట్టణములకు సాయన మేషాది మాసములందు గలుగు దేశాంతర విఘడియలు ధన (+) ఋణ(-)పు గుర్తులలో చూపబడినవి. పై దేశాంతరములు సాయన మాసారంభమునకు అగును. అభీష్ట గ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు ఇష్టసాయన మాసమందు చూప బడిన ఋణ ధనములను చేయగా, ఇష్టగ్రామమునకు తిథ్యాదు లగును. పై దేశాంతర విఘటికలను నిమిషములను పంచాంగ మందు చూపబడిన సూర్యోదయ గంటలలో ఋణ ధనముల గుర్తులకు వ్రత్యయముగ సంస్కరించగ స్వస్థలమునకు స్టాండర్డు టైముకు సరిపడు సూర్యోదయ కాలమువచ్చును. అస్తమయ కాలములో ఈ విధంగా చేయరాదు.

## హోరాధిపతి చక్రము

| గంటలు | ఆదివారము పగలు-రాత్రి | సోమవారము పగలు-రాత్రి | మంగళవారము పగలు-రాత్రి | బుధవారము పగలు-రాత్రి | గురువారము పగలు-రాత్రి | శుక్రవారము పగలు-రాత్రి | శనివారము పగలు-రాత్రి |
|---|---|---|---|---|---|---|---|
| 6 - 7 | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ |
| 7 - 8 | శుక్ర కుజ | శని బుధ | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి | గురు చంద్ర |
| 8 - 9 | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని |
| 9 - 10 | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ | రవి గురు |
| 10 - 11 | శని బుధ | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ |
| 11 - 12 | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి |
| 12 - 1 | కుజ శని | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ | రవి గురు | చంద్ర శుక్ర |
| 1 - 2 | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ |
| 2 - 3 | శుక్ర కుజ | శని బుధ | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి | గురు చంద్ర |
| 3 - 4 | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ | రవి గురు | చంద్ర శుక్ర | కుజ శని |
| 4 - 5 | చంద్ర శుక్ర | కుజ శని | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ | శని బుధ | రవి గురు |
| 5 - 6 | శని బుధ | రవి గురు | చంద్ర గురు | కుజ శని | బుధ రవి | గురు చంద్ర | శుక్ర కుజ |

**షరా:** ప్రతిదినము పగలు12హోరలువుండును. దినప్రమాణం 30ఘు॥(12గం) అయినపుడు హోరాప్రమాణము 1గం అగును. దినప్రమాణము యొక్క హెచ్చుతగ్గులనుబట్టి హోరా ప్రమాణము 5 ని॥ల వరకు మార్పుచెందును. సూర్యోదయం నుండి రమా రమి 1గంట చొప్పున పగలు రాత్రి 12 హోరలు అగును. ఆయా హోరాధిపతులనుబట్టి ఫలం చూడవలెను.

### హోరాధిపతి చక్రము

**రవి:** రాజకీయకార్యక్రమములు,దానములు,కోర్టువ్యవహారాలు, అధికారులదర్శనము, ఉత్తరప్రత్యుత్తరములు జరుపుట, క్రయవిక్రయములు,ఉద్యోగప్రయత్నములు నూతనోద్యోగము లలోచేరుట, సన్మానముచేయుట, చేయించుకొనుట,దస్తావేజులు అప్పుపత్రములు వ్రాయుటకుమంచిది.

**చంద్ర:** గృహారంభము, గృహప్రవేశము, ఆభరణములు ధరించుట,నూతనోద్యోగములలోచేరుట.వ్యవసాయారంభము, తోటలువేయుట,స్త్రీసౌఖ్యమునొందుట,గొప్పవారిని చూచుట, నౌకాయానము, వెండి, బంగారము మొ॥నూతన పాత్రలందు భుజించుట,వస్త్ర,ముత్యలోహాదివ్యాపారములుచేయుటకుమంచిది.

**కుజ:**సాహసకృత్యములు,నిప్పుకొలుములు, యంత్రాగారములు, శస్త్రచికిత్స, మారణకృత్యములు, అభిచారక్రియ, శత్రువులపై దండెత్తుట, క్రూరకర్మలు, వధించుటవంటి పనులు చేయవచ్చును.

**బుధ:** నూతనవ్యాపారముచేయుట, విద్యాభ్యాసము, ముద్రణాది కార్యారంభములు, లేఖనక్రియ, ఆధ్యాత్మికవిద్య నభ్యసించుట, వైద్యారంభము, క్రీడలోపాల్గొనుట, ఆటలపోటీలను ప్రారంభించుట,దస్తావేజులు, అప్పుపత్రములు వ్రాయుటకు మంచిది.

**గురు:** పిల్లలకు సంబంధించిన పనులు, చెవులు కుట్టించుట, నామకరణ, ఉయ్యాలలోవేయుట మొ॥నవి. ప్రభుదర్శనము, దేవతాదర్శనము, యాత్రకుపోవుట, బహుమతినొందుట, శాస్త్రాధ్యయనమును ప్రారంభించుట, నూతనకార్యారంభములు, వివాహము, ఉపనయనము, కొత్తవస్తువులనుకొనుట, నూతన వస్త్రాలంకరణ, అప్పుతెచ్చుట,దేవతాసంబంధమైన సర్వ కార్యములు, దూరప్రయాణములు, గొప్పవారిఆశ్రయము పొందుట, పుస్తకరచనారంభము, గ్రంథముద్రణ వంటి పనులు చేయవచ్చును.

**శుక్ర:** వివాహాది ప్రయత్నములు, సంబంధములు నిశ్చయించుట, వినోదవస్తువులు కొనుట, ఔషధసేవ, క్రయవిక్రయములు,పశువులనుకొనుట, స్త్రీలతో పరిచయమునొందుట, నూతనవస్త్రాలంకరణ,సమస్తశుభకార్యారంభములు, యాత్రాదులు,ఋణంచేయుట,ఉద్యోగమందు చేరుటవంటివిమంచిది.

**శని :** భూమిని విక్రయించుట, మద్యశాలారంభము, నీచవృత్తి, చౌర్యము, అభిచారక్రియ, పొగతోటలు వేయుట, మట్టిపని, ధాన్యము, తిలతైల వ్యాపారంభములు. గానుగవేయుట, దున్నపోతులను కాడికట్టుట చేయుటకు మంచిది.

**ఆంధ్రదేశమున వర్జ్య, దుర్ముహూర్తములను మాత్రమే చూడవలయును. రాహుకాలము మొ॥నవి చూడనవసరంలేదు.**

## గౌరీ పంచాంగము దివా ముహూర్తములు

దిన ప్రమాణమును 8చే భాగించగా ముహూర్త ప్రమాణము వచ్చును.

| | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 2 | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| 3 | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 4 | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో |
| 5 | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| 6 | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | శుభం | లాభం |
| 7 | అమృ | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| 8 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

## రాత్రి ముహూర్తములు

రాత్రి ప్రమాణమును 8చే భాగించగా ముహూర్త ప్రమాణము వచ్చును.

| | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| 2 | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 3 | జ్వరం | ఉద్యో | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| 4 | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| 5 | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహం |
| 6 | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 7 | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 8 | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
| అశ్విని | మృగ | ఆశ్రేష | హస్త | అనూ | ఉ.షా | శత |
| భరణి | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా |
| కృత్తిక | పున | పూ.ఫ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా |
| రోహిణి | పుష్య | ఉ.ఫ | విశా | పూ.షా | ధని | రేవ |
| మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి |
| ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర |
| పున | పూ.ఫ | స్వాతి | మూల | శ్రవణ | ఉ.భా | కృత్తి |
| పుష్యమి | ఉ.ఫ | విశాఖ | పూ.షా | ధనిష్ఠ | రేవ | రోహి |
| ఆశ్రేష | హస్త | అనూ | ఉ.షా | శతభిష | అశ్వి | మృగ |
| మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆర్ద్ర |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవణ | ఉ.భా | కృత్తి | పున |
| ఉత్తర | విశా | పూ.షా | ధనిష్ఠ | రేవతి | రోహి | పుష్య |
| హస్త | అనూ | ఉ.షా | శతభిష | అశ్వి | మృగ | అశ్రే |
| చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భరణి | ఆర్ద్ర | మఖ |
| స్వాతి | మూల | శ్రవణ | ఉ.భా | కృత్తిక | పున | పూఫ |
| విశాఖ | పూ.షా | ధనిష్ఠ | రేవతి | రోహిణి | పుష్య | ఉఫ |
| అనూ | ఉ.షా | శతభిష | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త |
| జ్యేష్ఠ | అభి | పూ.భా | భరణి | ఆర్ద్ర | మఘ | చిత్త |
| మూల | శ్రవ | ఉ.భా | కృత్తిక | పున | పూ.ఫ | స్వాతి |
| పూ.షా | ధని | రేవతి | రోహిణి | పుష్య | ఉ.ఫ | విశా |
| ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ |
| అభి | పూ.భా | భరణి | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ |
| శ్రవణం | ఉ.భా | కృత్తిక | పునర్వ | పూ.ఫ | స్వాతి | మూల |
| ధనిష్ట | రేవతి | రోహిణి | పుష్యమి | ఉ.ఫ | విశా | పూషా |
| శతభి | అశ్వి | మృగశిర | ఆశ్రేష | హస్త | అనూ | ఉషా |
| పూ.భా | భరణి | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి |
| ఉ.భా | కృత్తిక | పునర్వ | పూ.ఫ | స్వాతి | మూల | శ్రవ |
| రేవతి | రోహి | పుష్యమి | ఉ.ఫ | విశా | పూ.షా | ధని |

## ఆనందాది యోగములు

| | | |
|---|---|---|
| ఆనందయోగము | 15దిన॥లలో | కార్యసిద్ధి |
| కాలదండయో॥ | 27ది॥ | కార్యసిద్ధి |
| ధూమ్రయో॥ | 15ది॥ | పనికాదు,సొమ్మునష్టం |
| ధాత్రీయో॥ | 15ది॥ | కార్యసిద్ధి |
| సౌమ్యయో॥ | 16ది॥ | కార్యసిద్ధి,సర్వసౌఖ్యం |
| ధ్యాంక్షయో॥ | | కార్యహాని,దుఃఖప్రాప్తి |
| ధ్వజయో॥ | 27ది॥ | కార్యసిద్ధి,వేశ్యాగమనం |
| శ్రీవత్సయో॥ | | లాభం |
| వజ్రయో॥ | | కార్యనాశనం,చచ్చినజంతుదర్శనం |
| ముద్గరయో॥ | | కలహం,దుష్టశకునం |
| ఛత్రయో॥ | 27ది॥ | స్త్రీలాభం,కమలదర్శనం |
| మిత్రయో॥ | 22ది॥ | తీర్థదర్శనం,సన్మిత్రలాభం |
| మానసయో॥ | | కార్యలాభం |
| పద్మయో॥ | 15ది॥ | ఐశ్వర్యము |
| లంబవియో॥ | | కార్యవిలంబనం,అపశకునం |
| ఉత్పాతయో॥ | | ద్రవ్యనాశనం,అపవకునం |
| మృత్యుయో॥ | | హాని,సర్పదర్శనం |
| కాలయో॥ | | అవమానం |
| సిద్ధియో॥ | 15ది॥ | పనియగును,సువాసినీదర్శనం |
| శుభయో॥ | 14ది॥లలో | పనియగును |
| అమృతయో॥ | | కార్యసిద్ధి వస్త్రలాభం |
| ముసలయో॥ | | దుఃఖం |
| గదాయో॥ | | చెఱుపుకలుగును |
| మాతంగయో॥ | | అశ్వలాభం,బ్రాహ్మణదర్శనం |
| రాక్షసయో॥ | | చెడ్డది,మిత్రకలహం |
| చరయో॥ | | దుర్వాక్యశ్రవణం |
| స్థిరయో॥ | | శుభాశుభమిశ్రమం,కత్తికనిపించును |
| వర్థమానయోగము | | శివాదర్శనం,ఉత్తమం |

## లగ్నాంత్య పుష్కరాంత్య కాలములు తెలియజేయు పట్టిక (పుష్కరాంతము=పు.అం)

| రవియున్నరాశి | మేష ఘ.వి. | వృష ఘ.వి. | మిధున ఘ.వి. | కర్క ఘ.వి. | సింహ ఘ.వి. | కన్య ఘ.వి. | తుల ఘ.వి. | వృశ్చిక ఘ.వి. | ధను ఘ.వి. | మకర ఘ.వి. | కుంభ ఘ.వి. | మీన ఘ.వి. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేష పు.అం | 3-2 | 58-42 | 53-46 | 48-20 | 42-49 | 37-29 | 32-14 | 26-50 | 21-17 | 15-58 | 11-15 | 7-4 |
| మేషాంతం | 4-20 | 60-00 | 55-4 | 49-38 | 44-7 | 38-47 | 33-32 | 28-8 | 22-35 | 17-16 | 12-33 | 8-22 |
| వృష.పు. అం | 6-38 | 2-18 | 57-22 | 51-56 | 46-25 | 41-5 | 35-30 | 30-26 | 24-53 | 19-34 | 14-51 | 10-40 |
| వృషభాంతం | 9-16 | 4-56 | 60-00 | 53-34 | 49-3 | 43-43 | 38-28 | 33-4 | 27-31 | 22-12 | 17-29 | 13-18 |
| మిథున పు.అం. | 13-37 | 9-17 | 4-21 | 58-55 | 53-24 | 48-4 | 42-49 | 37-24 | 31-52 | 26-33 | 21-50 | 17-39 |
| మిథునాంతం | 14-42 | 10-22 | 5-26 | 60-00 | 54-29 | 49-9 | 43-54 | 38-30 | 32-57 | 27-38 | 22-55 | 18-44 |
| కర్క పు.అం. | 15-59 | 11-39 | 6-43 | 1-17 | 55-46 | 50-26 | 45-11 | 39-47 | 34-14 | 28-55 | 24-12 | 20-1 |
| కర్కాటకాంతం | 20-13 | 15-53 | 10-57 | 5-31 | 60-00 | 54-40 | 49-25 | 44-1 | 38-28 | 33-9 | 28-26 | 24-15 |
| సింహ పు. అం | 23-57 | 19-37 | 14-41 | 9-15 | 3-44 | 58-24 | 53-9 | 47-45 | 42-12 | 36-53 | 32-10 | 27-59 |
| సింహాంతం | 25-33 | 21-13 | 16-17 | 10-51 | 5-20 | 60-00 | 54-45 | 48-21 | 43-48 | 38-29 | 33-46 | 29-35 |
| కన్య పు. అం | 28-0 | 23-40 | 18-44 | 13-18 | 7-47 | 2-27 | 57-12 | 51-48 | 46-15 | 40-56 | 36-13 | 32-2 |
| కన్యాంతం | 30-48 | 26-28 | 21-32 | 16-6 | 10-35 | 5-15 | 60-00 | 54-36 | 49-3 | 43-44 | 39-1 | 34-50 |
| తులా పు. అం | 35-7 | 30-47 | 25-51 | 20-25 | 14-54 | 9-34 | 4-19 | 58-55 | 53-22 | 48-3 | 43-20 | 39-9 |
| తులాంతం | 36-12 | 31-52 | 26-56 | 21-30 | 15-59 | 10-39 | 5-24 | 60-00 | 54-27 | 49-8 | 44-25 | 40-14 |
| వృశ్చి పు. అం | 37-30 | 33-12 | 28-14 | 22-48 | 17-17 | 11-57 | 6-42 | 1-18 | 58-46 | 50-26 | 45-43 | 41-32 |
| వృశ్చికాంతం | 41-45 | 37-25 | 32-29 | 27-3 | 21-33 | 16-12 | 10-57 | 5-33 | 60-00 | 54-41 | 49-58 | 45-47 |
| ధను పు. అం | 45-28 | 41-8 | 36-12 | 30-46 | 25-16 | 19-55 | 14-40 | 9-16 | 3-43 | 58-24 | 53-41 | 49-30 |
| ధనురాంతం | 47-4 | 42-41 | 37-48 | 32-22 | 26-51 | 21-31 | 16-16 | 10-52 | 5-19 | 60-00 | 55-17 | 51-6 |
| మకర పు. అం | 49-16 | 44-56 | 40-0 | 34-34 | 29-3 | 23-43 | 18-28 | 13-4 | 7-31 | 2-12 | 57-29 | 53-18 |
| మకరాంతం | 51-46 | 47-27 | 42-31 | 33-5 | 31-34 | 26-14 | 20-59 | 15-35 | 10-2 | 4-43 | 60-00 | 55-49 |
| కుంభ పు. అం | 55-8 | 50-48 | 45-52 | 40-26 | 34-55 | 29-35 | 24-20 | 18-56 | 13-23 | 8-4 | 3-21 | 59-10 |
| కుంభాంతం | 55-58 | 51-38 | 46-42 | 41-16 | 35-45 | 30-25 | 25-10 | 19-46 | 14-13 | 8-54 | 4-11 | 60-00 |
| మీన పు. అం | 56-54 | 52-34 | 47-38 | 42-12 | 36-41 | 31-21 | 26-6 | 20-42 | 15-9 | 9-50 | 5-7 | 0-56 |
| మీనాంతం | 60-00 | 55-40 | 50-44 | 45-18 | 39-47 | 34-27 | 29-12 | 23-48 | 18-15 | 12-56 | 8-13 | 4-2 |

సూచన :- ఈ సారిణిలో నీయబడిన లగ్నాంత్య పుష్కరాంత్య కాలములు సూర్యుడాయా రాసులలో ప్రవేశించిన దినమున కీయబడినవి. ఇష్టదినమునాటి సూర్యోదయకాలిక భుక్తిని తీసివేసినచో ఆ దినమునాటి స్పష్టకాలము వచ్చును. ఉదా:- సూర్యుడు మేషరాశిలో నుండగా వృశ్చికాంతము 41-45 లున్నవి. ఇష్ట దినమునాటి భుక్తి ఘ॥2-0 లు ఉన్నచో ఈ భుక్తిని పై ఘడియలలో తీయగ 39-45 ఇష్టదినమునాటి వృశ్చికాంత్యకాలమగును. ఇట్లే యితరములూహ్యములు. ఈ ఘడియలను గంటలలోనికి మార్చి నాటి సూర్యోదయపు గం॥లకు కలిపినచో మొత్తం గంటలు వచ్చును.

**సూచన :- ముహూర్తములను నిర్ణయించుటలో ఎల్లవేళల దోష రహితములైనవి. దృక్సిద్ధపద్ధతివి మంచివి. సందర్భమును బట్టి ముహూర్తములను నిర్ణయించుటలో అల్పదోషములు కూడా లేకుండా చూస్తూ, బహుగుణములు కల ముహూర్తములను నిర్ణయించవలెను. లేని యెడల ముహూర్త సంబంధమైన దోషఫలములు 9 సంవత్సరముల లోపు వరకు, కొన్ని దోషములు శాశ్వతముగాను బాధించును.**

శుభముహూర్తములకు యోగ్యములగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము ముహూర్తములకు ఏకవింశతి దోషము లుండరాదు. దోషాపవాదములను తెలుసుకొనవలెను. పాపాక్రాంత, పాపవేధ లుండరాదు.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషాంశములు |
|---|---|---|---|---|---|
| నిషేకము | 2-3-5<br>7-10 | సో-బు<br>గు-శు | అ-రో-ఉఫ-హ-స్వా-అనూ<br>ఉషా-శ్ర-శత-ఉభా | వృష మిథున<br>కర్క కన్య,తుల,ధ,మీ | లగ్నశుద్ధి-మాఘాది<br>పంచకము శుభము |
| గర్భాదానము | 2-3-5<br>7-10-13 | సో-బు<br>గు-శు | రో-మృ-పున-పుష్య-ఉఫ-హ-చి<br>స్వా-అనూ-ఉషా-శ్ర-ధ-శత-ఉభా | వృష,కర్క,కన్య<br>తు,ధ,మీ | 1,8 శుద్ధి, పంచపర్వములు<br>నింద్యములు |
| పుంసవము | 2-3-5<br>7-10-13(శు) | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పున,పుష్య,ఉఫ,హ,చి,స్వా<br>అనూ,మూల,ఉషా,శ్ర,ధ,శత,ఉభా,రే | వృష,సింహ మినహా<br>మిగిలిన లగ్నములు | 3-4 మాసములు |
| సీమంతము | 2-3-5<br>7-10-13(శు) | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పున,పుష్య,ఉఫ,హ,చి,స్వా<br>అనూ,మూల,ఉషా,శ్ర,ధ,శత,ఉభా,రే | వృష,సింహ మినహా<br>మిగిలిన లగ్నములు | 4-6-8 మాసములు,<br>నవమశుద్ధి |
| జాతకర్మ | 2-3-5<br>7-10 -13(శు) | సో-బు<br>గు-శు | అశ్వి,రో,పున, పుష్య,ఉఫ,హ,స్వా<br>అనూ,ఉషా,శ్ర,ధ,శత, ఉభా | వృష,మిథు,కర్క,కన్య<br>తు,ధ,మీ | అష్టమశుద్ధిచవి,నవ,పూర్ణిమ<br>అమా,తిథులు నింద్యములు |
| నామకరణము | 2-3-5<br>7-10-13(శు) | సో-బు<br>గు-శు | అశ్వి,రో,పున,పుష్య,ఉఫ,హస,స్వా<br>అనూ,ఉషా,శ్ర,ధ,శత,ఉభా | వృష,మిథు,కర్క,కన్య<br>తు,ధ,మీ | అష్టమ శుద్ధి 11వ రోజు<br>ఆచారము |
| ఉయ్యాలలోవేయుట | 2-3-5<br>7-10-13(శు) | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పున,పుష్య,ఉఫ,హ,చి<br>అనూ,ఉషా,ఉభా, రేవతి | వృష,మిథు,కర్క,<br>తు,ధ,మీ | 1-3-5 మాసములు<br>అష్టమశుద్ధి |
| అన్నప్రాశన | 2-3-5<br>7-10- | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పున,పుష్య,ఉఫ,హ,చి<br>అనూ,ఉషా,శ్ర,ధ,శత,ఉభా,రే | వృష,మిథు,కర్క,<br>తు,ధ,మీ | దశమశుద్ధి స్త్రీలకు 5-7-9<br>మాస॥పురుషులకు 6-8-10మాస |
| కర్ణవేధ | 13(శు)<br>2-3-5 | సో-బు<br>గు-శు | అశ్వి,మృ,పున,పుష్య, ఉఫ,హ,చి<br>అనూ,ఉషా,శ్ర,ధ,శ,ఉభా,రేవతి | వృష,మిథు,కర్క,<br>తు,ధ,మీ | అష్టమ శుద్ధి<br>6-7-8 మాస॥ |
| కేశఖండన | 7-10-13(శు)<br>2-3-5 | సో-బు<br>గు-శు | అశ్వి,మృ,పున,పుష్య,హ,చి,స్వా<br>శ్ర,ధ,శత,రేవతి | వృష,మిథు,కర్క,కన్య<br>తు,ధ,మీ | 3సం॥రంఉత్తరాయణపూర్వయామం1వసం॥<br>లోపుపురుష2,4-6-8-10-12మాస స్త్రీ3-5-7-9-11 |
| అక్షరాభ్యాసము | 7-10-13(శు)<br>2-3-5 | సో-బు<br>గు-శు | అశ్వి,పున,పుష్య,హ,చి,స్వా<br>అనూ,శ్ర,రే | వృష,మిథు,కన్య<br>ధ,మీ | 5 సం॥ ఉత్తరాయణం<br>అష్టమశుద్ధి |
| విద్యారంభ | 10-11-12<br>2-3-5 | సో-బు<br>గు-శు | అశ్వి,మృ,ఆ,పున, హ,చి,స్వా<br>మూ,శ,ధ,శ,పూర్వాత్రయంపుష్యఆశ్రే | 6-4-7-10,5,9ల్లో<br>శుభులున్న లగ్నం | అష్టమశుద్ధి అనధ్యాయాధి<br>దినరహితం |
| ఉపనయనము | 6-11<br>2-3-5-7 | ఆ,సో,బు<br>గు,శు | అశ్వి,మృ,పున,పుష్య,ఉఫ,హ,చి<br>స్వాతి,అనూ,ఉషా,ఉభా,రేవతి | లగ్నచంద్ర పాపగ్రహ<br>రహిత లగ్నము | అస్టమశుద్ధి మంగళ, శనివారములుపనికిరావు<br>కేంద్రకోణములందు శుభులు మంచిది |
| వివాహము | 10బ.ప2-3-5<br>2-3-5-7 | సో,బు,గు,శు<br>ఆది,శని(మ) | రో,మృ,మఘ,ఉత్త,హస్త,స్వా,అనూ<br>మూల,ఉషా,ఉభా, రేవతి | వృష,మిథు,కర్క,కన్య<br>తు,ధ,మీ | సప్తమశుద్ధి |
| నూతనవస్త్రధారణ | 10-11-13 -15<br>2-3-5 | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పున,ఉఫ,హ,చి<br>స్వాతి,అనూ,మూ,శ్ర,ధ,శ,ఉషా,ఉభా | వృష,మిథు,కర్క,కన్య<br>తు,ధ,మీ | తృతీయ శుద్ధి |
| శంకు-స్తంభ,శిలా<br>ఇష్టకాన్యాసముగృహారంభ | 7-10-13<br>2-3-5-6-7 | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పున,పుష్య,ఉత్తరాత్రయ<br>హ,చి,స్వా,అనూ,శ్ర,ధ, శత | వృష,మిథు,ధను<br>మీ,స్థిర రాశులు | 4-8 స్థానశుద్ధి |
| గృహప్రవేశం | 10-11-12-13 15<br>2-3-5-7-10 | సో-బు<br>గు-శు | రో,మృ,ఉఫ,చి,అనూ,ఉషా<br>ధని,ఉభా,రేవతి | వృష,మిథు,కన్య<br>తు,ధ,మీ | 4,8,శుద్ధి 12 శుద్ధి(మతాం)<br>వృషకలశ చక్రశుద్ధి |
| కూపారంభం | 11-12-13-15<br>2-3-5-7 | సో,<br>గు,శు | రో,మృ,పుష్య,ఉఫ,హ,అనూ<br>పూషా,ఉషా,శ్ర,ధ,ఉభా,శత,రేవతి | కర్క మకర, మీన | వాయవ్య ఉత్తరఈశాన్యతూర్పు<br>పడమరలందు శ్రేష్ఠము |
| ప్రయాణము | 10-13<br>2-3-5-7 | సర్వ<br>వారములు | అశ్వి,మృ,పున,పుష్య,హ,అనూ,శ్ర<br>మూల, ధ, రేవతి | మేష,వృష,కర్క,<br>కన్య, ధ, మీ | వారశూలలు కూడదు |
| బీజావాపనము | 10-13<br>2-3-5-7 | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పుష్య,ఉఫ,హ,స్వా<br>అనూ | వృష,మిథు,కర్క,కన్య<br>ధ, మీ | విత్తనాలరంగునుబట్టివారమును<br>నిర్ణయించవలెనుఎరుపుకుకుజుడు |
| వ్యాపారము | 10-13<br>2-3-5-7<br>10-13(శు) | సో-బు<br>గు-శు | అశ్వి,రో,మృ,పుష్య,హ,చి,అనూ,<br>ఉత్తరాత్రయ రేవతి | వృష,మిథు,కర్క, కన్య<br>తు, ధ, మీ | కుంభము పనికిరాదు1,11<br>లందు చంద్ర శుక్ర మంచివి |

# శ్రీ హేమలంబ సంవత్సర గోచార ఫలములు

## మేషం అశ్వని 4 పా॥ భరణి 4పా॥లు కృత్తిక 1వ పాదము

**ఆదాయం - 5 ఖర్చు - 5 ; పూజ్యత - 3 అవమానం - 1**

ఈ రాశివారికి గురుడు ఆగస్టు వరకు షష్ఠస్థానము నందునూ, తదుపరి జనవరి వరకు సప్తమ స్థానము, సంవత్సరాంతము వరకు అష్టమ స్థానము నందును సంచరించును. శని నవమ స్థితినందు, రాహు, కేతువులు ఆగస్టు వరకు పంచమ, లాభస్థితుల యందు మొత్తము మీద ఈ రాశివారికి మిశ్రమ ఫలములు గోచరించుచున్నవి. సెప్టెంబరు వరకూ కొంత కష్టముగా నున్నప్పటికినీ తరువాత మంచి ఫలితములు కలుగును. కుటుంబమునందు అశాంతి, ఉదర సంబంధ అనారోగ్య సమస్యలు, పనులయందు పురోగతి మందగించుట జరుగును.బంధువులతో వివాదములు, ఇతరులతో అకారణ కలహములు జరిగినప్పటికీ దైవానుగ్రహముచేతనూ, వారి వారి తెలివితేటల చేతనూ పనులయందు అభివృద్ధి, వాహనప్రాప్తి, సంపదలు పొందగలరు. ఆధ్యాత్మిక యందు ఆసక్తి పెరుగును. ఉద్యోగస్తులు బదిలీలు, ఇతరులచే ఇబ్బందులు ఎదుర్కొనగలరు. రాజకీయనాయకులకు వివాదములు, శతృబాధలు పెరుగును. వైద్యులకు అనుకోని సమస్యలు వచ్చినప్పటికినీ తెలివితో ఎదుర్కొనగలరు. స్త్రీలకు విజయము, వస్తు ప్రాప్తి లభించును. పబ్లిక్ రంగములవారికి కొంత అనారోగ్యము, భయమునుండి ముక్తి పొందుట జరుగును. వ్యవసాయదారులకు ఋణబాధలు, తగిన ఫలసాయం లభింపక మానసిక క్లేశములు. జనరల్, వస్త్ర, కిరాణా, అపరధాన్యముల వ్యాపారులకు వాహనప్రాప్తి, తగిన లాభములు చేకూరును. విద్యార్థులు మానసిక అశాంతి ఎదుర్కొనుదురు. మొత్తము మీద ఆగస్టు నుండి కొంత అనుకూలములు కనిపించును. మనశ్శాంతి కొరకు శివాలయ దర్శనము, శివాభిషేకములు చేసుకొనవలెను.

**ఏప్రియల్ :** శరీరము నందు అలసట, హృదయ సంబంధ అనారోగ్యము, అగ్ని, చోరభయములు, సంఘం నందు కీర్తి, అధికార యోగము, కుటుంబం నందు అశాంతి, స్త్రీమూలముగా వ్యయం, ఆధ్యాత్మిక పరమైన పనులు చేయుట జరుగును. **మే :** ప్రయాణముల యందు నష్టము, కార్యహాని, అనారోగ్యసూచన, విద్యార్థులకు అతిశ్రమచే విజయము,, స్నేహితులు, బంధువులతో అకారణ కల హము విలాసంకోసం ఖర్చుచేయుట, కార్యహాని, ఆధ్యాత్మిక పరమైన పనుల యందు పాల్గొనుట జరుగును. **జూన్ :** ఉద్యోగప్రాప్తి, అధికఖర్చులు, మానసిక ఆందోళన, మోసపోవుట, అక్రమముగా సంపాదించుట, నూతన పరిచయములు, బలహీనత, భార్యతో వివాదము, విలాసముగా గడుపుట, ఇతరుల వస్తువుల యందు ఆసక్తి పొందుట జరుగును. **జూలై :** నూతన కార్యలాభం, ధనంవలన ఆనందం, అనారోగ్య సమస్య, ఉదర సంబంధ ఇబ్బంది, ప్రభుత్వము నుండి సహకారం, బంధువులతో కలయిక, గొప్పవారి స్నేహం, విలాసముగా గడుపుట జరుగును. **ఆగస్టు :** వైద్యం కొరకు ఖర్చుచేయుట, ఉదర సంబంధ అనారోగ్యము, అవసరమునకు ధనము అందుట, వాహనయోగము, సమయస్ఫూర్తితో కష్టము నుండితప్పుకొనుట, నూతన పరిచయములు, వస్త్రవ్యాపారులకు నష్టము కలుగును. **సెప్టెం :** ఆదాయము పెరుగుట, ఋణముతీరుట, శతృవుల విషయంలో జాగ్రత్త వహించవలెను. కుటుంబము నందు సమస్యలు, సమస్యలు ఏర్పడినప్పటికీ సమస్య స్ఫూర్తితో తప్పుకొనగలరు. పశు,వాహనాదుల ప్రాప్తి, నూతన పరిచయములు, క్షేత్రములు దర్శించుట జరుగును. **అక్టోబరు :** అనుకోని ప్రయాణములు, ఆరోగ్యము కుదుటపడుట, రోగ, ఋణ,శతృబాధలు తీరుట, నూతన ఆభరణములు కొనుట, సంఘంనందు గౌరవము పొందుట శరీరంనందు అలసట, స్త్రీ సుఖము, విందు, వినోదాలలో పాల్గొనుట, సంతానము వృద్ధి జరుగును. **నవం:** జీర్ణ సంబంధ ఇబ్బందులు, భార్యతో వివాదములు, అవమానములు పొందుట, నూతన వస్తు లాభం, గొప్పవారి స్నేహం, కంటికి అలసట, వస్త్రాలంకారప్రాప్తి, ఇంటికి అలంకారముల కోసం ఖర్చుచేయుట, వైద్యంకొరకు ఖర్చుచేయుట, సంతానము వలన సుఖము, కోపము పెరుగుట జరుగును. **డిశంబరు :** పనుల యందు ఆటంకములు, స్త్రీలకు చిక్కులు, మానసిక వ్యధ, సమయమునకు ధనము అందకపోవుట, వైద్యము కొరకు ఖర్చుచేయుట, అపరిచితుల వలన నష్ట పోవుట, క్షేత్రములు దర్శించుట జరుగును. **జనవరి :** భార్యభర్తల మధ్య మనస్పర్థలు, జీర్ణ సంబంధ యిబ్బందులు, కష్టముతో జయము కలుగుట, సమస్యతో కూడిన పనులయందు విజయము పొందుట, నూతన వస్త్రలాభం, స్త్రీమూలకముగా ధనములభించుట జరుగును. **ఫిబ్ర :** అనారోగ్యంనుండి ఉపశమనము, కీర్తిప్రతిష్టలు పెరుగుట, సత్కారములు, కార్యసిద్ధి, ప్రయాణములలో అలసట, శారీరక శ్రమ, రక్తస్రావము, శతృవులపై విజయము, విందు వినోదములలో పాల్గొనుట, లావాదేవీలు ఫలించుట, కుటుంబము నుండి దూరముగా ఉండుట జరుగును. **మార్చి :** సత్పురుషుల దర్శనం, నీచులవలన మోసపోవుట, ఆదాయం పెరుగుట, అవమానములు, శరీరమునందు ఎముకలు,రక్తము సంబంధ యిబ్బందులు, వాహనముల ప్రయాణములయందు జాగ్రత్త వహించుట మంచిది. ఋణము చేయుట, స్త్రీవలన ఖర్చుచేయుట, పనుల యందు ఆలస్యము జరుగును.

## వృషభం కృత్తిక 2,3,4 పా॥ రోహిణి 4పా॥ మృగశిర 1,2పా॥

**ఆదాయం - 14 ఖర్చు - 11; పూజ్యత - 6 అవమానం - 1**

ఈరాశివారికి గురుడు ఆగస్టు వరకు పంచమ స్థానమునందు తదుపరి జనవరి వరకు షష్ఠస్థానము, సంవత్సరాంతము వరకు సప్తమ స్థానము నందు సంచరించును. శని అష్టమ స్థితినందు సంచరించును. రాహువు, కేతువులు ఆగస్టు వరకు చతుర్థ, దశమ స్థానముల నందునూ, తదుపరి సంవత్సరాంతము వరకు తృతీయ, నవమస్థానముల నందునూ సంచరించును. ఈ రాశివారికి ఈ సంవత్సరము సాముదాయకముగా మిశ్రమఫలములు గోచరించును. శుభకార్యములు, ఆధ్యాత్మికమైన పనులు చేయుట, నూతన వాహనములు పొందుట, దూరదేశ సంచారము చేయుట, అనుకూలముకాని పనులు చేయుట. వ్యాపారస్థులకు మధ్యస్థముగా లాభములు వచ్చుట, రియల్ఎస్టేట్, భూసంబంధ వ్యాపారముల వారికి లాభించుట, జరుగును. వ్యవసాయదారులకు, పశుసంపద వృద్ధిపొందుట, లాభములు ఫలించును. విద్యార్థులకు అధికశ్రమచే పరీక్షల యందు ఉత్తీర్ణులగుదురు. దూరదేశము కొరకు ప్రయత్నించు విద్యార్థులకు అనుకూలముగానుండును. పబ్లిక్ సంబంధమైనవారికి కొన్ని ఇబ్బందులు. న్యాయవృత్తి, వైద్యవృత్తుల వారికి బాగుగా నుండును. స్త్రీలకు ఆభరణ,వస్తు,లాభము కలుగును. కుటుంబమునందు కొన్ని సమస్యలు ఎదుర్కొనవలసి వచ్చును. ఉద్యోగస్థులకు బదిలీలు తప్పవు. షేర్లు, స్పెక్యులేషన్స్ సంబంధముగా జాగ్రత్తవహించుట మంచిది.

**ఏప్రిల్ :** సత్పురుషులదర్శనం, కీర్తిప్రతిష్ఠలు పెరుగుట, నీచులవలన నష్టము కలుగుట, ఆదాయము పెరుగుట, శారీరకశ్రమ, వాహనముల వలన ప్రమాదములు, అప్పులుచేయుట, శుభకార్యముల యందు పాల్గొనుట విందు వినోదములు జరుపుట కుటుంబం నందు సమస్యలు ఉండగలవు. **మే :** ప్రయాణముల యందు వస్తునష్టము,, ఉదర సంబంధ అనారోగ్యము, శారీరకశ్రమ, అవమానములు పొందుట, శత్రువుల వలన బాధలు, క్షేత్రములు, దైవ సంబంధ దర్శనములు చేసుకొనుట, వాహనసౌఖ్యం, నూతన వస్తులాభం కలుగును. **జూన్ :** శారీరక శ్రమ, తప్పుడు నిర్ణయములు తీసుకొనుట, ధననష్టము, అధిక ప్రయాణములు, అగ్ని, చోరబాధలు, ప్రభుత్వము నుండి అనుకూలత లేకపోవుట అకారణ కలహములు, అవసరమునకు ధనము కూడును, గృహ,వస్తు సంబంధలాభములు కలుగును. **జూలై :** ఉద్యోగప్రయత్నములు ఫలించుట, ప్రమోషన్స్ పొందుట, ఆకస్మిక ధనలాభం కలుగును. కానీ ఖర్చుపెరుగును. ముఖ్యమైన వస్తువు దొంగతనము జరుగుట, జంతువుల వలన లాభము, స్త్రీ సుఖము, ఇంటి సంబంధ వస్తువులు, అలంకారవస్తువులు కొనుట జరుగును. **ఆగస్టు :** అనారోగ్య సమస్యలకు పరిష్కారము దొరుకుట, ఆనందముగా గడుపుట, నమ్మక ద్రోహం పొందుట, రక్త,ఉదర సంబంధ ఇబ్బందులు, స్నేహితుల, బంధువుల సహకారము లభించుట, వ్యవసాయదారులకు పంటలు బాగుగా ఫలించుట, అధికారుల వలన లాభము, కార్యసిద్ధి కలుగును. **సెప్టెం :** వైద్యముకొరకు ఖర్చుచేయుట, దుష్టస్నేహమువలన నష్టపోవుట, కుటుంబములో అశాంతి, స్త్రీవలన వివాదము, సంఘంనందు గౌరవము, వస్త్రవ్యాపారులకు నష్టము కలుగుట, స్వార్థంకోసం తప్పుడు పనులు చేయుట, కుటుంబమునకు దూరంగా ఉండుట. **అక్టో :** ఆదాయము పెరుగుట, ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరము, ఆభరణములు కొనుట, నూతన పరిచయములు, శతృవులపై విజయము, కార్యసిద్ధి, విందు, వినోదాల్లో పాల్గొనుట, గురువుల అనుగ్రహము పొందుట, దూరప్రయాణము చేయుట జరుగును. **నవం :** శ్రమతో కూడిన ప్రయాణములఋ, అప్పులు తీరుట, ఆదాయవృద్ధి, భయములు తీరుట, జ్ఞాపకము కోల్పోవుట, అనుకోని గొడవలు పడుట, వస్త్రాలంకార ప్రాప్తి, స్త్రీ సుఖం తగ్గుట, స్త్రీలవలన సమస్యలు వచ్చుట, ప్రేమ విఫలమగుట, మనస్తాపం కలుగును. **డిశం :** నూతన వస్తులాభం, ఆరోగ్యము కొరకు ఖర్చుచేయుట, అనుకోని ప్రయాణముల వలన ఖర్చు పెరుగుట, పుత్రసుఖము, సంతానము వలన సంతోషము, స్త్రీసుఖం తగ్గుట, భార్యాభర్తల మధ్యవివాదము, నూతన గృహంకొరకు ప్రయత్నములు ఫలించుట జరుగును. **జన :** పనులయందు ఆటంకము, రోగపీడ, స్త్రీభోగం తగ్గుట, వాహనములు, నడుపుటయందు జాగ్రత్తవహించుట, స్త్రీవిషయంలో అయిష్టత, భూమి,గృహ సంబంధముగా ప్రయత్నములు అనుకూలించుట, దానధర్మములు చేయుట జరుగును. **ఫిబ్ర :** గొప్పవగు పనులు విజయవంతముగా పూర్తిచేయుట, కార్యసిద్ధి, స్థిరాస్తి లాభము, కంటి సంబంధ ఇబ్బందులు, అధికప్రయత్నముచే పనులు జరుగుట, గొడవల వలన మధ్యస్థ పరిష్కారము విందు వినోదములలో పాలొనుట జరుగును. **మార్చి :** స్థాన చలనముర, అనుకోని ప్రయాణములు, ముఖ్యమైన వారి యొక్క ఆపదల వలన మానసికవ్యధ, నీచులవలనహాని, అప్పులుచేయుట, వాహనములు నడుపుట యందు జాగ్రత్త వహించవలెను. అవసరమునకు ధనము అందుట, నూతన పరిచయములు ఏర్పడుట జరుగును.

